


కొన్ని వేల సంవత్సరాల కిందట, ఎత్తయిన పర్వతాలూ, అరణ్యాల మధ్య బంగారు లోయ అనే రాజ్యం వుండేది. ఆ పర్వతాల వెనక మరికొంత ఎత్తయిన పర్వతశ్రేణీ, దానిని చుట్టి మరింత ఎత్తయిన మరొక పర్వతవలయం వుండేవి. దానిపైన వున్న మహావృక్షాలు మేఘాలమధ్య తేలియాడు తున్నట్టు కనబడేవి.

ఆ రాజ్యంలోని ప్రజలు, తమ తమ వృత్తుల్లో కష్టపడి పని చేస్తూ తృప్తిగా వుండేవాళ్ళు. అయితే, కొద్దిమందికి మాత్రం తృప్తీ, సుఖాలంటూ వుండేవి కావు. వాళ్ళు మరింత సుఖంకోసం తపనపడు తూండేవాళ్ళు. వాళ్ళెవరంటే—ఆ దేశపు రాజూ, ఆయన ఆస్థాన ఉద్యోగులూ.

రాజు, ప్రజల యోగక్షేమాలు గమనించేందుకు, కొందరిని నియోగించాడు. వాళ్ళు సభతీరి, రాజుగారి క్షేమమే, దేశ క్షేమం అని తీర్మానించారు. రాజుకు, వాళ్ళ తెలివితేటలు అద్భుతం అనిపించింది. దానితో ఆయన పరమానందంచెంది వాళ్ళకు పూర్వం వున్న జ్ఞానులు అన్న బిరుదును మార్చి, మహాజ్ఞానులు అన్న బిరుదులిచ్చాడు.

తర్వాత, ఆ మహాజ్ఞానులు సమావేశమై, రాజుగారికి అన్నీ వున్నా వినోదం కొరవడిందని తీర్మానించి, ఇక నుంచి ఆస్థాన గాయకులు, తలకిందులుగా నిలబడి పాటలు పాడవలసిందిగా శాసించారు. గాయకులు చేసేదిలేక అలా

మనోజ్ దాస్



పాడుతున్నప్పుడు, రాజు సంతోషంతో పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవాడు.

రాజూ, ఆస్థానోద్యోగులు ఎలా వున్నా, ప్రజలు మాత్రం చాలా శాంత స్వభావులు. వాళ్ళు కోట వెనక వున్న పర్వతం కేసి చూస్తూ, బాధతో నిట్టూర్చేవాళ్ళు. ఆ పర్వతం పేరు మీదుగానే, ఆ రాజ్యానికి బంగారు లోయ అన్న పేరు వచ్చింది.

ప్రజలలో ప్రచారమవుతున్న వదంతుల ప్రకారం, ఆ పర్వతంలోని, ఒకానొకచోట గొప్ప బంగారుగని వున్నది. ఒకానొకప్పుడు, బంగారులోయ రాజ్యాన్ని గుణవంతుడూ, ధర్మపరుడూ అయిన ఒక రాజు పాలించాడు. ఆయన చిత్రకారుడే కాక, గొప్ప శిల్పి. ఆయన తరచుగా ధ్యానసమాధిలో వుండేవాడు. అలాంటి ఒక తరుణంలో, ఆయనకు, ఆ బంగారుగని ఎక్కడ వున్నదో సూచనప్రాయంగా తెలిసింది.

ఆ రాజశిల్పి కొంత బంగారాన్ని పోగు చేసి, దానితో ఒక అద్భుత సౌందర్యవతి యైన స్త్రీ విగ్రహాన్ని తయారు చేశాడు. రాజ్యప్రజలందరికీ, ఆ విగ్రహాన్ని ఒక శుభదినాన చూసేందుకు వీలు కలిగిస్తానని, రాజ్యంలో చాటింపు వేయించాడు. అయితే, దుష్టుడైన ఆయన మంత్రి కారణంగా, రాజ్యం అల్లకల్లోలమైంది.

మంత్రికి సింహాసనంతోపాటు, బంగారు గనిని కూడా తనదిగా చేసుకోవాలనే దురాశకలిగింది. అతడు పొరుగురాజుతో కుట్రపన్ని, ఒక రాత్రివేళ కోట మీద దాడి చేశాడు. కోట రక్షకభటులు శత్రువులను ఎదిరించారు. పోరు ప్రారంభమైంది.

అలాంటి సమయంలో, ఒక వింత జరిగింది. హఠాత్తుగా భూమి కంపించి, కోట వెనుక వున్న పర్వతం బద్దలై, దాని రాళ్ళు కోట మీదికి వచ్చిపడి, కోటను ధ్వంసం చేసినై. కోటతోపాటు, అక్కడ యుద్ధం చేస్తున్నవాళ్ళు దుర్మరణం పాలయారు. మంత్రీ, అతడి వెంట వచ్చిన శత్రుదేశపు సైనికులూ కూడా ప్రాణాలు కోల్పోయారు.



సూర్యోదయంతర్వాతరాజశిల్పి,ఆయన తయారు చేసిన బంగారుయువతి విగ్రహం కనిపించకుండా పోయినై. రాజు ఎటో పారిపోయి వుంటాడనీ, విగ్రహం రాళ్ళతో కప్పబడిందనీ, ప్రజలు అనుకోసాగారు.

ఆ తర్వాత కొన్ని సంవత్సరాలపాటు, దాపులనున్న అరణ్యంలో, తమ రాజు పోలికలున్న, ఒక మునిని చూసినట్టు కొందరు చెప్పసాగారు. అయితే, ఎవరికీ ఆయనను సమీపించి మాట్లాడడం సాధ్య పడలేదు. మరి కొందరి ఊహప్రకారం రాజు, కోట వెనక వున్న జలపాతంలో నుంచి పెద్ద గుహ దాటి, ఆవల ఎన్నో ఆమడలదూరంలో వున్న సముద్రం కేసి పోయివుంటాడని. వాళ్ళు జలపాతం, దాని చాటున వున్న గుహ గురించి చెప్పుకోవడమే గాని, ఎవరూ దాన్ని దాటి ఆవలకుపోవడం అంటూ జరగలేదు. ఒకవేళ ఎవరైనా అలాంటి ప్రయత్నం చేస్తే, ప్రాణాలతో 'తిరిగిరావడం సాధ్య పడదన్న నమ్మకం వాళ్ళకుండేది.

బంగారులోయ రాజ్యం దుష్టమంత్రికి సాయం చేసిన పొరుగుదేశపు రాజు అధీనం లోకి వెళ్ళింది. ఆ రాజుకు బంగారులోయ లోని ప్రకృతి సౌందర్యంతోపాటు, అక్కడ లభించబోయే బంగారం మీద-కూడా ఆశ పుట్టింది. ఆ కారణంగా, రాజ్యాన్ని



తమ్ముడి పరం చేసి, బంగారులోయలోని పాత రాజభవనానికి దూరంగా, మరొక రాజభవనం నిర్మింపచేశాడు.

భూకంపంవల్ల కూలిపోయిన పాత కోటనూ, రాజభవనాన్ని క్రమంగా చెట్టూ చేమలూ, పొదలూ ఆక్రమించినై. ప్రజలు ఆ ప్రాంతానికి వెళ్ళడానికి భయపడే వాళ్ళు. ఆ ప్రదేశమంతా రాత్రివేళలే కాక, పగటివేళ కూడా భూతప్రేతాలు తిరుగాడు తున్నవన్న వదంతులుండేవి. విషసర్పా లకూ, ఎలుగుబంట్లకూ, పులులకూ, ఆ పరిసరాలు నివాస యోగ్యంగా మారినై.

అయితే, వినోదుడు అనే యువకు డొకడు, ఆ ప్రాంతాల నిర్భయంగా తిరుగు



తూండేవాడు. అతడు పసితనంలోనే తల్లిని కోల్పోయాడు. తండ్రి తాను చేసే వృత్తిలో మంచి నేర్పరి. అతడికి కొడుకును గురించిన ఆలోచనే వుండేదికాదు. ఆ కారణంవల్ల, వినోదుడు ఎవరూ తేరిపారచూడని, ఆ భయంకరమైన శిథిల ప్రాంతాల తిరుగుతూండేవాడు. ఒక్కొక్కసారి ఆకలిగొన్న పులి నుంచీ, కాటువేయనున్న విషసర్పాన్నుంచీ, ఎంతో ఒడుపుగా ప్రాణరక్షణ చేసుకునేవాడు.

ఒకనాటి సాయంకాలం, హఠాత్తుగా పడమటి ఆకాశం ఎర్రనైపోయింది. గాలి స్తంభించిపోయింది. వందలకొలది అరణ్య జంతువులు గర్జనలూ, అరుపులూ ప్రారంభించినై. కొద్దిసేపటి తర్వాత, పెనుగాలులు లేచి అరణ్యప్రాంతమంతా ఫెళఫెళారావాలతో మోగసాగింది.

పొలాల్లో పని చేసేవాళ్ళూ, వీధుల్లో తిరిగే ప్రజలూ భయకంపితులై పరిగెత్తసాగారు. లోయ అంతా ఒకసారి దద్దరిల్లిపోయింది. అది ఒక పెద్ద భూకంపం. పాతకాలపునాటి రాజుగారి కోట ప్రాంతమంతా, భూకంపం తాకిడికి చిన్నాభిన్నమైపోయింది. అక్కడ పైకెగిరిన బండరాళ్ళు కొన్ని, కొత్త రాజుగారి కోట మీద పడి, కోటకొమ్ము విరిగి శబ్దంతో నేలకూలింది.

రాజు బెదిరిపోయి, తాను నియోగించిన మహాజ్ఞానులందరికీ కబురు చేసి పిలిపించాడు. ఆయన వాళ్ళతో, "కోటకొమ్ము నేలరాలిందంటే, దానిని కట్టినవాళ్ళ తలలు కూడా నేలరాలవలసిందే!" అన్నాడు కోపంగా.

అందుకు ప్రధానమంత్రి, "చండమార్తాండ, ప్రభో! ఈ కోటనూ, రాజప్రాసాదాలనూ కట్టినవాళ్ళు, ఎన్నో తరాల కిందటివాళ్ళు. వాళ్ళిప్పుడు బతికిలేరు," అని జవాబిచ్చాడు.

"అయితే ఏం? అప్పు తీసుకున్నవాడు మరణిస్తే, ఆ బాకీని వాడి వారసులు చెల్లించాలి గదా? నేను శుంఠనేంకాదు," అన్నాడు రాజు.





"మేం మహాజ్ఞానులం మాత్రమే. మీరు మహా మహా జ్ఞానులు, మహారాజా!" అన్నాడు ప్రధానమంత్రి.

ఇప్పటి యువకుడైన వినోదుడి తాత గారు, ఆ కోట నిర్మాణానికి సాయపడిన శిల్పి, ప్రధాన వాస్తుశాస్త్రజ్ఞుడూ కావడంతో, భటులుపోయి వినోదుడి తండ్రిని పట్టి బంధించి తీసుకువచ్చి, మహారాజు ముందు నిలబెట్టారు.

"తల కొట్టెయ్యండి!" అని రాజు ఆజ్ఞాపించాడు.

అప్పుడు ఆస్థానోద్యోగి ఒకడు వినయంగా, "మహారాజా, విరిగి నేలకూలిన అంత పెద్ద కోటకొమ్ముకు, వీడి యింత చిన్న తల కొట్టించడం సరి అయిన శిక్ష కాదు," అన్నాడు.

ఆ ఉద్యోగికి వినోదుడి తండ్రి మీద జాలికలిగింది.

"అయితే, ఏం చెయ్యమని, నీ సలహా?" అని రాజు అడిగాడు.

"ఒక్క వెయ్యి సంవత్సరాల జైలు శిక్ష విధించండి," అన్నాడు రాజోద్యోగి.

"ఆహాఁ, వెయ్యి సంవత్సరాల శిక్ష! అమోఘం!" అన్నాడు రాజు పెద్దగా చప్పట్లుచరుస్తూ.

ఆ విధంగా వినోదుడి తండ్రి జైలు పాలయ్యాడు. ఇది చూసి వినోదుడు



చాలా వ్యాకులపడ్డాడు. అతడికి, ఆ తండ్రి తప్ప నా అన్నవారింకెవరూలేరు. క్రూరమైన, యీ శిక్ష విధించిన మహారాజును, అంతమందిలోనూ బాగా దుర్భాషలాడాలనుకున్నాడు, వినోదుడు. కాని అతడి మంచికోరే వాళ్ళు, సర్ది చెప్పారు.

"వినోదా, నువ్వు కోపం కొద్దీ, మహారాజును ఏమైనా దూషించావో, నీకూ నీ తండ్రికి పట్టిన దురవస్థే పడుతుంది. తొందరపడకు. ఏదో విధంగా, నీ తండ్రి విడుదలయ్యేలా చూస్తాం," అన్నారు వాళ్ళు.

అయితే, వినోదుడి తండ్రి సంవత్సరం తిరక్కుండానే జైల్లో మరణించాడు.



ఈ వార్త విన్న రాజు దిగులుపడి పోతూ, "ఆ నేరస్థుడు, తొమ్మిదివందల తొంభైతొమ్మిదిరోజుల జైలుశిక్ష తప్పించుకోవాలని చూశాడు, అవునా?" అని మంత్రులను అడిగాడు.

వాళ్ళల్లో ఒకడు, "మహారాజా, నాదొక సలహా. తండ్రి ఆస్తికి కొడుకు వారసుడయినప్పుడు, అతడి జైలుశిక్షకు మాత్రం ఎందుకు వారసుడు కాడు?" అన్నాడు.

"భళిభళీ, మంత్రీ! ఆ చచ్చినవాడి కొడుకును తక్షణం పట్టి జైల్లో పారెయ్యండి!" అన్నాడు రాజు.

అయితే, యీ ఆజ్ఞ గురించి విన్న వినోదుడు, భటులు తనను పట్టుకోవడానికి వచ్చేలోపలే, అరణ్యం కేసి బయలుదేరాడు.

అతడు అరణ్యం చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అయినా, వినోదుడికి అక్కడి చెట్లలో, తుప్పల మధ్యగా నడిచి పురాతన శిధిలాలను చేరడం బాగా అలవాటే. అతడు ఆ ప్రాంతాన్ని చేరి, తరచుగా తను కూర్చునే ఒక పెద్ద బండరాయి మీదకి వెళ్ళి కూర్చున్నాడు. ఆ సరికి చంద్రోదయమై, అరణ్యమంతా వెన్నెలకాంతి ప్రసరించింది. వినోదుడు తన తండ్రి మరణానికి చాలాసేపు దుఃఖించి సొమ్మసిల్లి కళ్ళు మూశాడు.

కొంతసేపటికి అతడికి మెలకువ వచ్చింది. అతడు కళ్ళు తెరిచేసరికి, ఎదురుగా ఒక వెలుగు కనిపించింది. అది చంద్రకాంతి కాదు. అక్కడ ఎగుడు దిగుడుగా వున్న కొండరాళ్ళు తప్ప, వినోదుడు లోగడ మరేమీ చూసివుండలేదు.

అయితే, యిప్పుడు ఆ ప్రదేశాన ఒక గుహ అతడి కంటబడింది. ఆ గుహలో తళతళ మెరిసిపోతున్న ఆకారం ఒకటి నిలిచివున్నది. వినోదుడు అటు కేసి నడవసాగాడు. అతడు గుహను చేరేసరికి, లోపల ఒక బంగారు స్త్రీమూర్తి, చేతిలో ఒక తామరపువ్వుతో, నిలబడి వుండడం చూసి అత్యాశ్చర్యం పాలయ్యాడు.





ఆ వెంటనే అతడికి బంగారులోయ గురించి, తాను విన్న పురాతన గాథ గుర్తుకు వచ్చింది. ఈ బంగారుస్త్రీ విగ్రహం, అలనాడు శిల్పకళలో ఆరితేరిన రాజు చేసినదై వుండాలి! భూకంపంవల్ల, అది కొండరాళ్ళ నుంచి బయటపడింది!

వినోదుడు ఆ విగ్రహం కేసి పరీక్షగా చూడసాగాడు. కొద్దిసేపట్లో, అతడికి ఆ విగ్రహాన్ని తాను ముందే చూసి వున్నానన్న అనుమానం కలిగింది. కాని, అతడికది నమ్మశక్యంగా కనిపించలేదు. పాత రాజరికం పోయి, కొత్తవాళ్ళు బంగారు లోయను ఆక్రమించినతర్వాత, రాజ్యంలో కళలను ప్రోత్సహించడం జరగలేదు.

వినోదుడు విగ్రహాన్ని తాకి చూశాడు. ఆ క్షణంలో అతడికి కలిగిన ఆనందం అంతాయింతా కాదు. అతడు తన్మయుడై పోతూ విగ్రహం చేతిలో వున్న తామర పువ్వు మీద చేయి వేశాడు. ఆ సమయంలో విగ్రహం వేలికున్న ఉంగరం ఒకటి జారి, అతడి వేలును చేరింది.

వినోదుడు ఉంగరం కేసి చూసి నిర్ఘాంతపోయాడు. తర్వాత అతడికి ఎంతో ఆనందం కలిగింది. అతడు విగ్రహం కేసి కన్నార్పకుండా చూస్తూ, ఉన్నచోటునే కూర్చున్నాడు. ఆ మరుక్షణం, అతడిని మత్తులాంటిది ఆవహించింది.

ఆ స్థితిలో అతణ్ణి ఒక కంఠస్వరం హెచ్చరిస్తూ, "ఈ బంగారు విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకోవాలని వున్నదా?" అని అడిగింది.

"అవును, తెలుసుకోవాలని వున్నది!" అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

"అలా అయితే, విగ్రహరక్షణకు తగు ఏర్పాట్లు చేసి, జలపాతం వెనక వున్న గుహలో ప్రవేశించు. గుహ దాటిన తర్వాత, ఒకానొక కొత్త ప్రదేశాన, నువ్వొక దేవతను చూస్తావు. ఆ దేవత ద్వారా రహస్యం నీకు తెలుస్తుంది. ఈ బంగారు విగ్రహం జీవం గల కన్య అయాక, ఆమెను వివాహమాడేందుకు పరం కోరు," అన్నదా కంఠస్వరం. —(ఇంకావుంది)






## 2

[బంగారులోయ రాజ్యంలో భూకంపంవల్ల కోటకొమ్ము విరిగి నేలకూలింది. రాజు ఆ కోటను నిర్మించిన వాస్తుశిల్పి మనమడైన వినోదుడికి జైలుశిక్ష విధించాడు. అతడు పట్టుపడకుండా అరణ్యం చేరాడు. అక్కడ అతడు ఒక బంగారు స్త్రీ విగ్రహాన్ని చూశాడు. జలపాతానికి వెనక ఉన్న గుహలో ప్రవేశించమని, అతణ్ణి ఒక కంఠస్వరం హెచ్చరించింది. తరవాత—]

జలపాతం వెనక వున్న గుహలో ప్రవేశించి అక్కడి దేవతను వరం కోరమని హెచ్చరించిన కంఠస్వరం వినగానే, వినోదుడికి పట్టరాని ఆనందం కలిగింది. అయితే, ఆ కంఠస్వరం చెప్పిన జలపాతం దాటి, దాని వెనక వున్న గుహ ద్వారంకుండా ఆవలికి వెళ్ళినవాళ్ళెవరూ, యింతవరకు తిరిగి రాలేదు. కాని, వినోదుడికి తనను హెచ్చరించిన, ఆ కంఠస్వరం సత్యం పలికిందన్న దృఢమైన నమ్మకం కలిగింది.

అయితే, తను విగ్రహ రక్షణకు ఎవరి సాయమైనా కోరాలన్న ఆలోచన కలిగింది, వినోదుడికి. కొంత ఆలోచించిన మీదట, మహారాజు కన్న అందుకు తగిన వాళ్ళు మరెవరూ లేరని నిర్ణయించుకున్నాడు.

ఆ సరికి తూర్పు తెల్లనవుతున్నది. వినోదుడు మరొకసారి బంగారు విగ్రహం

మనోజ్ దాస్







కేసి చూశాడు. ఆ విగ్రహం పెదాల మీద చిరునవ్వు కదిలినట్టు అతడికి అనుభూతి కలిగింది.

వినోదుడు, కోట కేసి బయలుదేరాడు. సూర్యోదయం అయిందన్న సూచనగా, కోట ద్వారరక్షకులు అప్పుడే బాకాలు ఊదారు. వినోదుడు వాళ్ళను సమీపించి, ''నేను వెంటనే మహారాజుగారిని దర్శించాలి!'' అన్నాడు.

''మహారాజుగారిని దర్శిస్తావా? తమరు చక్రవర్తులా ఏమిటి కోరగానే ఆయన దర్శనం యివ్వడానికి? తెల్లవారిందన్న హెచ్చరికగా బాకాలూది, మా విధి మేము నిర్వహించాం. ఇక ఆయనను నిద్రలేపేందుకు, పడకగదిగవాక్షం ఎత్తువరకూ తన కిరణాలను ప్రసరించడం, సూర్యుడిపని,'' అన్నారు ద్వారరక్షకులు.

వినోదుడు మారుమాట్లాడకుండా, వాళ్ళను తప్పుకుని కోట ద్వారం దాటాడు.

''ఆగు!'' అంటూ కోట రక్షకులు పెద్దగా బొబ్బరిస్తూ, వినోదుణ్ణి ఆపి చూశారు. కాని, అతడి ముఖం చూస్తూనే బెదిరిపోయినవాళ్ళలా పక్కలకు తప్పుకున్నారు. ఇందుకు కారణం వాళ్ళకు అర్థం కాలేదు.

వినోదుడికి కూడా యిది వింతగా కనిపించింది. అతడు అక్కడ కనిపించిన సేవకుణ్ణి మహారాజుగారి పడకగది ఎక్కడ అని అడిగితే, అప్పుడే సూర్యకిరణాలు ప్రసరిస్తున్న గదినొకదానిని అతడికి చూపించాడు.

వినోదుడు దాన్ని సమీపించి, ''మహారాజా, తక్షణం నిద్రలేవండి! తమ కొక గొప్ప శుభవార్త చెప్పదలిచాను,'' అంటూ పెద్దగా కేకపెట్టాడు.

ఆ కేక విన్న రాజసేవకు డొకడు, వినోదుడిపై కోపగించుకుని, ''మహారాజుగారి కెన్నో బిరుదనామాలున్నవి. కనీసం వాటిలో—చండమార్తాండ అన్న బిరుదుతోనైనా వారిని సంబోధించు,'' అన్నాడు పళ్ళుకొరుకుతూ.



వినోదుడు వాడి మాటలు పట్టించుకోకుండా, "హేఁ, మహారాజా!" అంటూ మరింత బిగ్గరగా కేకపెట్టాడు.

మహారాజు ఆ కేకకు అదిరిపడి, పడక మీది నుంచి లేచి, తెరిచివున్న కిటికీ దగ్గిరకు వచ్చాడు. ఇది గమనిస్తూనే భటులుకొందరు స్తంభాలచాటుకూ, గోడల పక్కకూ తప్పుకున్నారు. మహారాజు, ఆ కుర్రవాడితోపాటు, తమనూ కఠినంగా శిక్షిస్తాడన్న భయం వాళ్ళకు కలిగింది.

మహారాజు కిటికీ దగ్గిర పళ్ళుకొరుకుతూ కొంచెంసేపు నిలబడ్డాడు. తర్వాత, హఠాత్తుగా ముఖకవళికల్లో మార్పు వచ్చింది. ఆయన పెద్ద గొంతుతో, "ఎవర్రా అక్కడ? ఆ వచ్చిన కుర్రవాణ్ణి, యిక్కడికి పంపండి," అంటూ ఆజ్ఞయిచ్చాడు.

వినోదుడు పరుగునపోయి, మహారాజు పడకగదిని చేరాడు. వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకున్నారో ఎవరికీ అంతుపట్టలేదు. అయితే, మహారాజు హడావిడిగా మెట్లు దిగాడు.

అక్కడ వున్న భటులకూ, రాజసేవకులకూ, వినోదుణ్ణి సరిగా చూసి గుర్తుపట్టడం అప్పుడే సాధ్యపడింది. వాళ్ళల్లో చాలామంది వినోదుణ్ణి ఎరుగుదురు. అతడి సాహసవర్తన మహారాజుతోపాటు, అందరినీ విభ్రాంతులను చేసింది.



మంత్రుల్లో ఒకడు అప్పుడే, ఆ ప్రదేశానికి వచ్చి, జరిగింది తెలుసుకుని, మహారాజుతో, "కాని....చండమార్తాండ మహారాజా...." అంటూ ఏదో చెప్పబోయాడు.

అయితే, మహారాజు విసుగ్గా, "ఒరే చచ్చువెధవల్లారా, నోరుమూసుకుని నా వెంట రండి!" అంటూ అరిచాడు.

ఆ సమయానికింకా, మహారాజుగారి గుర్రం నిద్రలేవలేదు. ఆలస్యాన్ని సహించలేని మహారాజు, వినోదుడు దారితీయగా, అతడి వెనకగా నడవసాగాడు.

వినోదుడు, ఆయన్ని, "మహారాజా, తమరు అప్పుడప్పుడూ అరణ్యానికి వినోద



యాత్ర ఎందుకు చేయకూడదు?'' అని అడిగాడు.

''ఒరే, మతిలేని కుర్రవెధవా, నేనెందుకు అరణ్యం ప్రవేశించాలి? మహారాజులుండవలసింది మేడల్లో, అరణ్యాల్లో కాదు,'' అన్నాడు మహారాజు.

''అరణ్య వృక్షాలకింద పరుగులు తీస్తూ, సెలయేటి నీళ్ళను మీద జల్లుకుంటూ అలా స్వేచ్ఛగా తిరగడంలో ఎంత ఆనందం వుంది!'' అన్నాడు వినోదుడు.

''స్వేచ్ఛా! నేను ఎవరి స్వేచ్ఛనైనా హరించగలను. అంతకన్న నాకు కావలసిన స్వేచ్ఛ ఏమున్నది! సరే, కుర్రాడా నిజం చెప్పు. అసలు అరణ్యంలోకి వెళ్ళాలన్న ఆలోచన, నీకెందుకు కలిగింది?'' అని మహారాజు వినోదుణ్ణి ప్రశ్నించాడు.

''అరణ్యంలోకి వెళ్ళకపోతే, ఆ బంగారు విగ్రహం, నాకంట ఎలా పడేది? అదుగో, చూడండి!'' అంటూ వినోదుడు, కొద్దిదూరంలో వున్న విగ్రహాన్ని మహారాజుకు చూపించాడు.

మహారాజు రెండు చేతులనూ నడుం మీద పెట్టుకుని, బంగారు విగ్రహం కేసి చూడసాగాడు. అతడి ముఖకవళికల్లో కోపం, అంతలోనే వెకిలినవ్వూకదలాడినై. ఆయన, వినోదుడి కేసి తల తిప్పి, ''ఒరే, నాతో వేళాకోళం ఆడుతున్నావా? నువ్వు చెప్పినచోట, నిలువుగా బండరాళ్ళు తప్ప, నాకేమీ కనిపించడం లేదు,'' అన్నాడు.

ఆ ప్రశ్నకు వినోదుడు ఆశ్చర్యపోయి, ''చండమార్తాండ మహారాజా! సూర్యకాంతిలో మిలమిల మెరిసిపోతున్న బంగారు విగ్రహం తమకు కనిపించడం లేదా? ఆశ్చర్యంగా వున్నది,'' అన్నాడు.

''కనబడడం లేదు! కనబడడం లేదు!'' అన్నాడు రాజు ఉగ్రుడైపోతూ.

''మహారాజా, అలా ఎందుకు జరిగింది?'' అన్నాడు వినోదుడు అర్థం కాక.

"ఎందుకు జరిగిందంటే—అసలక్కడ విగ్రహం లేదు కనక. ఒరే, అడవి గుడ్లగూబ వెధవా! అసలు నన్ను నిద్ర

ఎందుకు లేపావు? ఆ సమయంలో నేను పెళ్లికొడుకుగా అలంకరింపబడుతున్నట్టు కలగంటున్నాను. నీకు చావు తప్పదు!'' అంటూ హుంకరించాడు మహారాజు.

వినోదుడు ఏమాత్రం భయపడక, ''మీరు చాలాసార్లు పెళ్ళికొడుకయ్యారు; మీరు చంపింది కూడా ఏమంత తక్కువ మందిని కాదు,'' అన్నాడు.

కాని, మహారాజు, యీ మాటలేవీ వినే స్థితిలో లేడు. ఆయన గట్టిగా నేలను తన్ని, ''పడకగది నుంచి బయలుదేరి నప్పుడు, ఆ హడావిడిలో ఒక్కొక్క కాలికి ఒక రకం చెప్పు తొడుక్కున్నాను. మహారాజైనవాడు నిద్రలేస్తూనే ప్రప్రథమంగా చేయవలసింది, దువ్వెనతో చక్కగా మీసాలు దువ్వుకోవడం—ఆ పనీ మరిచాను,'' అన్నాడు.

వినోదుడు నివ్వెరపడి మహారాజు కేసి చూడసాగాడు. మహారాజు ముంచెత్తుకు వస్తున్న దుఃఖాన్ని ఆపే ప్రయత్నంలో పెద్దగా అరిచాడు. ఆ అరుపుకు రాళ్లగుట్టల చాటు నక్కలు బిగ్గరగా ఊళలు పెట్టినై.

ఈ కేకలూ, గగ్గోలూ విన్న ప్రధాన మంత్రీ, మహాజ్ఞానుల సభలోని ఐదుగురు సభ్యులూ, మహారాజు కేదో ప్రమాదం జరిగిందన్న శంకతో, అక్కడికి పరుగు, పరుగున వచ్చారు.



రాజు, వాళ్ళకేసి కళ్ళురుముతూ చూసేంతలో, మహాజ్ఞానుల్లో ఒకడు, ''మహారాజా!'' అన్నాడు బొంగురుపోయిన గొంతుతో.

మరొకడు, ఆదుర్దాపడిపోతూ, ''చండమార్తాండప్రభో!'' అన్నాడు కీచుకంఠంతో.

ఆ వచ్చిన ఐదుగురిలో, ఏ ఒక్కడికీ జరిగిందేమిటో అంతుపట్టలేదు. ఒక కుర్రకుంక భవనానికి వచ్చి పిలిస్తే, తమ రాజంతవాడు, వాడి వెంటపడి, ఈ శిథిలాలకు ఎందుకు వచ్చినట్టు?

అంతలో రాజు గట్టిగా తుమ్మాడు. మహాజ్ఞానులు ఐదుగురూ కంపించిపోతూ, ఆయన కేసి చూశారు.



''నువ్వు చెప్పేచోట, ఒక గుడ్లగూబ నా కంటికి కనబడుతున్నది,'' అన్నాడు మంత్రి.

''గుడ్లగూబా! అదేంకాదు. అక్కడ ఒక పెద్ద సాలెపురుగు కనిపిస్తున్నది. అంత లావుపాటి సాలెపురుగును, నా జన్మలో యింతవరకు చూడలేదు,'' అన్నాడు మహాజ్ఞానుల్లో ఒకడు.

వినోదుడు విసుగ్గా, ''ఎంతోకాలం కిందట, కొండరాళ్ళ చాటున పడిపోయిన బంగారు విగ్రహం, యిప్పుడు బయటికి వచ్చింది. అది మీకు కనిపించడం లేదా?'' అని అడిగాడు.

''ఏమిటీ? కొన్నివేల సంవత్సరాల కిందట, భూకంపంవల్ల కొండరాళ్ళ చాటున కప్పబడిపోయిన బంగారు విగ్రహం, అక్కడ వున్నదా? వీడికి పూర్తిగా బుద్ధి పెడతలపట్టింది!'' అన్నాడొక మహాజ్ఞాని.

మహాజ్ఞానులందరూ, అవునన్నట్టు తలలూపారు. ముంచుకొస్తున్న కోపంతో, ఈ సంభాషణ అంతా వింటున్న రాజు గట్టిగా చప్పట్లుచరిచి, ''ఈ అబద్ధాల కోరును పట్టుకుని, కింద వున్న అగాధంలోకి విసిరివేయండి!'' అన్నాడు.

వినోదుడు, రాజాజ్ఞ వింటూనే దూరంగా వెళ్ళబోయాడు. అంతలో రాజు, అతడి

అప్పుడు రాజు కనుబొమలు ముడిచి వాళ్ళ కేసి చూస్తూ, ''ఈ ప్రాతఃకాలపు పవనాలున్నవే, యివి అతి ప్రశస్తమైన, నాబోటి రాజ. వంశీకుడికి హానికరమని, నా దృఢవిశ్వాసం!'' అని, వినోదుణ్ణి వేలెత్తి చూపుతూ, ''ఈ కుర్ర వెధవ నన్ను ఆటపట్టిస్తున్నాడు,'' అన్నాడు.

వినోదుడు, ''ఆటపట్టించడమా?'' అంటూ ఆశ్చర్యపోయి, మహాజ్ఞానులతో, ''అయ్యా, రాజుగారికి మీరైనా చెప్పండి. మీ అందరికీ, అదిగో, అక్కడ బంగారు విగ్రహం కనిపిస్తున్నది గదా,'' అన్నాడు.

ఐదుగురు జ్ఞానులూ, ఆతృతగా వినోదుడు చెప్పిన దిక్కు కేసి చూశారు.





కుడిచేయి వడిసిపట్టుకున్నాడు. మంత్రి అతడి ఎడమచేతిని పట్టుకున్నాడు. మిగతా వాళ్ళలో యిద్దరు వినోదుడి కాళ్ళనూ, మరొకడు కంఠాన్నీ పట్టుకున్నారు.

అందరూ కలిసి, అతణ్ణి అగాధం కేసి ఎత్తుకుపోతున్నంతలో, బంగారు విగ్రహం వున్న వైపునుంచి, శ్రావ్యమైన రాగాలాపన వినబడింది.

మహాజ్ఞానుల్లో ఒకడు, "అద్భుతం! అద్భుతం!" అన్నాడు, వినోదుడి కాలి పట్టును వదులుతూ.

రాజు కోపంగా, "ఆగు! ఆ అద్భుతం సంగతి ముందుగా చెప్పవలసినవాణ్ణి, నేను! ఆ రాగాలాపన పంచదార లడ్డు అంత మధురంగా వున్నది. ఒక లడ్డు ఏమిటి? వందలు, వేలు!" అన్నాడు.

అందరికీ యిప్పుడు బంగారు విగ్రహం స్పష్టంగా కనబడుతున్నది. వాళ్ళు వినోదుణ్ణి వదిలి, విగ్రహం కేసి చూడసాగారు. మహాజ్ఞానుల్లో, ఒకడు, "చండ మార్తాండ, ప్రభో! ఆ విగ్రహం అందాన్ని ఇంద్రధనుస్సుతో సరిపోల్చవచ్చు," అన్నాడు.

రాజు, వినోదుడి చేయివదిలి, "ఒరే, కుర్రాడా, ఏమావిగ్రహసౌందర్యం! నేను, నిన్ను తాకినందువల్లనే, నా కంటికి ఆ బంగారు విగ్రహం గోచరించింది. నిన్ను మెచ్చి తీరవలసిందే!" అంటూ వినోదుణ్ణి కావిలించుకున్నాడు.

వినోదుడు సంతోషంగా, "చండ మార్తాండ, మహారాజా! ఆ విగ్రహం కళ్ళబడగానే, మీరెంత సౌందర్యవంతులుగా మారిపోయారో తెలుసా?" అన్నాడు.

"అలాగా! ఎక్కడ రోజూ నేను ముఖం చూసుకునే దర్పణం! అద్దం!" అంటూ కీచుమని, రాజు మహాజ్ఞానులతో, "మీలో ఒకరు వెంటనే కోటకుపోయి, అద్దం తీసుకురాగలరా?" అన్నాడు.

అయితే, వాళ్ళెవరూ రాజు మాటలు వినేస్థితిలో లేరు. అందరూ బంగారు విగ్రహం కేసి చూస్తూ తన్మయత్వంలో వున్నారు. —(ఇంకావుంది)






## 3

[అరణ్యంలో పురాతన శిథిలాల మధ్య, వినోదుడు ఒక బంగారు స్త్రీ విగ్రహం చూశాడు. జలపాతానికి వెనక ఉన్న గుహలో ప్రవేశించి, దాని రహస్యం తెలుసుకోమని ఒక కంఠస్వరం అతణ్ణి హెచ్చరించింది. విగ్రహానికి రక్షణ ఏర్పాటు చేయడానికి, వినోదుడు రాజును వెంట బెట్టుకుని వచ్చాడు. దాన్ని చూసి, రాజూ, మహాజ్ఞానులూ అమితాశ్చర్యం చెందారు.—తరవాత]

బంగారు విగ్రహం కళ్ళబడగానే రాజూ, ఉద్యోగులూ సౌందర్యవంతులుగా మారి పోయారు. అప్పుడు వినోదుడు, రాజుతో, "తమ ఉద్యోగులు కూడా క్షణాల మీద ఎంత చూడ చక్కని వాళ్ళయ్యారు, ఆశ్చర్యం!" అన్నాడు.

రాజు, వాళ్ళ కేసి గుచ్చి చూస్తూ, "ప్రాణం రాగానే, ఆ అందాలరాశిని పెళ్ళాడబోయేది, నేను! వీళ్ళు అంద గాళ్ళలా కనబడాలని చూడడం, వృథా శ్రమ," అన్నాడు.

"అలాగే, పెళ్ళాడండి, చండమార్తాండ మహారాజా!" అన్నాడు వినోదుడు చిన్నగా నవ్వుతూ.

"ఎంత అమాయకుడివిరా, నువ్వు! ఆ విగ్రహానికి ప్రాణం ఎందుకొస్తుందను కున్నావు? నేను వివాహమాడేందుకే కదా," అన్నాడు రాజు.

మనోజ్ దాస్







"నా అమాయకత్వానికి సిగ్గుపడు తున్నాను, మహారాజా," అన్నాడు వినోదుడు.

రాజు పెద్దగా నవ్వి, "మరి సిగ్గుపడకేం చేస్తావు! కొన్ని నిగూఢవిషయాలు, ఎంతో తెలివిమంతుడైన, నాబోటి రాజుకే అవగతం కాగలవు," అన్నాడు.

"మీరంత తెలివిగలవాళ్ళు కాదేమో అన్న అనుమానం కలుగుతున్నది, మహా రాజా!" అన్నాడు వినోదుడు.

"తెలివిగలవాణ్ణి కాదా? ఏమన్నావు నువ్వు!" అంటూ రాజు మీసం మెలివేశాడు.

వినోదుడు కొంచెంసేపు మౌనంగా వుండి, "మహారాజా, మీరూ, మీ ఉద్యోగులూ కూడా, ఆ విగ్రహం అంద చందాలు చూసి అద్భుతపడుతున్నప్పుడు, నిజంగానే సౌందర్యవంతులుగా కనిపించారు. కాని, మీరు అహం కొద్దీ, ప్రాణం రాగానే, ఆ విగ్రహకాంతను వివాహం అడతానన్న క్షణంలో, తిరిగి పూర్వం అంత అనాకారిగా మారిపోయారు— మీ ఉద్యోగులతో సహా," అన్నాడు.

"ఎంత పొగరు! నన్ను అనాకారి అంటావా?" అంటూ రాజు గుప్పెట్లు బిగించాడు కోపంగా.

"మేమూ అనాకారివాళ్ళమా?" అంటూ హుంకరించారు మహాజ్ఞానులు పట్టరాని ఆగ్రహంతో.

వాళ్ళందరూ తిరిగి వినోదుణ్ణి పట్టుకునేందుకు, ముందుకు దూకారు. అయితే, వినోదుడు వాళ్ళకు దొరక్కుండా బండరాళ్ళమీదినుంచి ఎగిరిదూకుతూ, జలపాతంకేసి పరిగెత్తసాగాడు.

రాజూ, ఆయన ఉద్యోగులూ, యిద్ద రిద్దరుగా ఒకళ్ళచేతులొకళ్ళు పట్టుకుని, బండరాళ్ళమీదినుంచి గెంతుతూ వినోదుడి వెంటబడ్డారు. అయితే, వాళ్ళకు యిలాంటి దేహశ్రమ అలవాటు లేదు గనక, కొద్ది సేపట్లోనే అలసిపోయి, రాళ్ళ మీది నుంచి జారి కిందపడి, శరీరాలు హూనం చేసుకున్నారు.







ఈ లోపల వినోదుడు జలపాతం ముందుకుపోయి నిలబడ్డాడు. రాజు పెద్దగా రొప్పుతూ, "ఒరే, కుర్రకుంకా! ఆ జలపాతంలో ప్రవేశించకు. చాలా ప్రమాదం," అని కేకవేశాడు.

"ఓయ్‌ం, చండమార్తాండరాజా! ఈ జలపాతం, దాని చాటున వున్న గుహ—అది దాటిపోతే వచ్చే ప్రదేశం ఎంత ప్రమాదకరమైనదో తెలీదు. కాని, వాటన్నిటికన్న, నీ రాజ్యంలో వుండడం మహాప్రమాదం!" అంటూ వినోదుడు జలపాతంకేసి ఒక్కొక్క అడుగు వేయ సాగాడు.

రాజూ, మహాజ్ఞానులూ నిశ్చేష్టులై, అతడి కేసి చూడసాగారు. వినోదుడు జలపాతం ప్రవేశించబోతూ, పెద్ద గొంతుతో, "నేను, యీ జలపాతందాటి, అవతలివైపుకుపోబోతున్నాను!" అన్నాడు.

రాజు రెండు చేతులూ పైకెత్తి ఊపుతూ, "ఒరే, ఆ జలపాతం దాటిపోయిన వాళ్ళెవరూ తిరిగిరాలేదు, జాగ్రత్త!" అంటూ కేకపెట్టాడు.

"ఆ వెళ్ళినవాళ్ళు తిరిగిరావడం యిష్టంలేకో, లేక తిరిగివచ్చే శక్తిలేకో—అలా జరిగివుంటుంది. కాని, నేను మాత్రం, ఆ బంగారు విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకుని తిరిగివస్తాను. మహారాజా, అప్పటివరకూ, ఆ విగ్రహ రక్షణ బాధ్యత తమది!" అన్నాడు.

వినోదుడు అన్న యీ మాటలు, అక్కడి కొండగుహల్లో, చుట్టూ వున్న అరణ్యంలో ప్రతిధ్వనించినై. రాజు నివ్వెరపాటుతో శిలాప్రతిమలా నిలబడిపోయాడు.

తర్వాత, అతడు అప్పుడే స్పృహ వచ్చినవాడిలా చేయి పైకెత్తి, "ఒరే, నువ్వేమీ దిగులుపెట్టుకోకు. ఆ బంగారు విగ్రహాన్ని పంచదారలడ్డూకన్నా—కాదు పంచదారలడ్డులగుండిగ కన్న ఎక్కువ జాగ్రత్తగా కాపాడతాను. ఎవడైనా, ఆ విగ్రహాన్ని తాకాడో, వాడితల కోటకొమ్మకు వేలాడ వలసిందే. నువ్వు మాత్రం, ఆ







రహస్యం తెలుసుకుని త్వరగా తిరిగిరా. నీకు నా రాజ్యంలో ఏదో ఒక మూల యింత ముక్క కట్టబెడతాను. అంతేకాదు—నా కుమార్తెల్లో ఒకరిని, అందచందాల్లో నాతో సరితూగగల ఆవిణ్ణి, నీకిచ్చి వివాహం చేస్తాను," అన్నాడు బిగ్గరగా.

అయితే, రాజు చెప్పినదంతా, వినోదుడి చెవిన పడిందోలేదో చెప్పడం కష్టం. అతడు భీతికొల్పే ధ్వనులతో, అంత ఎత్తునుంచి కిందికి ఉరకలువేస్తూ దూకుతున్న జలపాతపు నీటిలోకి ధైర్యంగా ప్రవేశించాడు.

జలపాతం దాటడానికి ఎంత సేపు పట్టిందో వినోదుడికి తెలియలేదు. ఒక్కొక్క అడుగు వేస్తున్నప్పుడల్లా, తాను వాయువేగంతో ముందుకు దూసుకుపోతున్నట్టు అతడి కనిపించింది.

కొంతసేపటికి వినోదుడు జలపాతం ఆవలి వైపుకు చేరుకున్నాడు. కొండలమయమైన బంగారులోయ రాజ్యం వంటి ప్రదేశమే అతనికి కనిపించింది. సూర్యకిరణాలు కూడా చొరలేనంత దట్టంగా, ఆ ప్రాంతమంతా చెట్లమయంగా ఉన్నది.

వినోదుడు దాపులనున్న ఒక చిన్న కొండను ఎక్కి, అవతలివైపుకు చూశాడు. చిన్న నదితో చుట్టబడిన విశాలమైన మైదానం అతని కంటబడింది.

"ఎవరా కుర్రవాడు?" అన్న కంఠస్వరం విని, వినోదుడు వెనకకు తిరిగి చూశాడు. పక్కనే ఉన్న మరొక చిన్న కొండమీదినుంచి గూనిముసలివాడొకడు, అతనికేసి వస్తున్నాడు. వాడికి పొడవైన గడ్డం ఉన్నది. వాడి కళ్ళు పాముకళ్ళలా మెరుస్తున్నవి.

వాడు, వినోదుణ్ణి సమీపిస్తూ, "ఎవరు నువ్వు? ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"నా పేరు వినోదుడు. ఇక్కడ ఏమీ చేయడంలేదు. అవును, నువ్వెవరు?" అన్నాడు వినోదుడు.

"నువ్వు మాట్లాడే ధోరణి, నాకు నచ్చలేదు. నేను, ఈ జ్ఞానభూమి ద్వార







నీ ఇష్టానుసారం ఎక్కడికయినా వెళ్ళ వచ్చు." అన్నాడు గూనివాడు.

త్వరగా గూనివాణ్ణి వదిలించుకోవచ్చు అన్న ఆనందంతో వినోదుడు నదిలోకి దూకాడు. నదిలో నీళ్ళు వెచ్చగా ఉన్నాయి. అతడు ఈదుతూ నదినిదాటి, అవలి గట్టున ఉన్న తుప్పను పట్టుకుని పైకి ఎక్కాడు. తనకు ఎదురుగా గూని ముసలివాడు నిలబడి ఉండడం చూసి, వినోదుడు అమితాశ్చర్యం చెందాడు.

"నువ్వు నది దాటడం నేను చూడ లేదు. ఇక్కడికెలా వచ్చావు?" అని అడిగాడు వినోదుడు గూనివాణ్ణి.

"ఆ గట్టున మాయమై, ఇవతలి గట్టును చేరుకున్నాను," అన్నాడు గూనివాడు.

"అది సాధ్యమా?" అన్నాడు వినో దుడు ఆశ్చర్యంతో.

"సాధ్యమే! ఎందుకంటే వాస్తవానికి మనం అందరమూ శక్తితరంగాలమే. మనకు తగిన జ్ఞానం ఉన్నట్టయితే, కావాలనుకున్నప్పుడు శక్తితరంగాలు గానూ, ఆ తరవాత మనుషులుగానూ, మారుతూవుండవచ్చు." అన్నాడు గూని వాడు.

"అలాగా!" అన్నాడు వినోదుడు.

"నీకు ముందే చెప్పాను కదా, నువ్వు జ్ఞానభూమిని చేరుకున్నావని. అయినా

రక్షకుణ్ణి, పూజారిని. ఈ క్షణంలో నువ్వేమీ చేయకుండా ఉండవచ్చు. కాని, మునుముందు ఏమి చేయాలను కుంటున్నావు?" అని ప్రశ్నించాడు గూని వాడు.

"నేను చాలా దూరం వెళ్ళాలి. అయితే, నేను చేరవలసిన ప్రదేశం ఎక్కడ ఉన్నదో, దానికి దారి ఎటు ఉన్నదో మాత్రం సరిగా నాకు ఇప్పుడు తెలియదు. బహుశా ఈ ప్రాంతంగుండానే వెళ్ళాలనుకుంటాను," అన్నాడు వినో దుడు నెమ్మదిగా.

"అలాగా! అయితే ఈ నదిలో దిగి, ఈదుతూ అవతలిగట్టు చేరుకో. ఆ పిమ్మట







నేను చెప్పిన ఈ జ్ఞానశక్తి కొందరికే పరిమితం,'' అంటూ గూనివాడు వినోదుణ్ణి సమీపించబోయాడు.

వినోదుడు అడుగు వెనకకు వేశాడు. గూనివాడు కోపంగా కనుబొమలు ముడిచి, ''అహంకారంతో ప్రవర్తించకు. నువ్వు నన్ను తప్పించుకోలేవు. నువ్వు ఈ జ్ఞాన భూమి పౌరుడివి కావాలంటే, నిన్ను తాకి, నీకు నామకరణం చేయాలి,'' అన్నాడు.

''వినోదుడన్న నా పేరుకేం లోటు? కొత్తగా నామకరణం ఎందుకు?'' అన్నాడు వినోదుడు.

''నామకరణం చేసి తీరాలి. అయినా, యిక్కడికి వచ్చిన తర్వాత కూడా, నీ పేరు నీకెలా జ్ఞాపకం ఉన్నది?'' అన్నాడు గూనివాడు కోపంగా.

''అది నా పేరు కనుక జ్ఞాపకం ఉన్నది,'' అన్నాడు వినోదుడు.

''నువ్వు ఆ నదిలో దిగగానే, నీ గతాన్నంతా మరిచిపోయి ఉండాలి. అలా కానప్పుడు, నువ్వీ జ్ఞానభూమి పౌరుడు కావడానికి వీలులేదు,'' అన్నాడు గూనివాడు.

''నువ్వనే, ఈ జ్ఞానభూమి పౌరుడు కావాలని నేను ఉబలాటపడటం లేదు. నేను ఈ ప్రాంతంకుండా వెళుతూన్న ఒక బాటసారిని మాత్రమే,'' అంటూ వినోదుడు ముందుకు నడిచాడు.

''మళ్ళీ అహంకారంతో మాట్లాడుతున్నావు. అయినా, ఈ జ్ఞానభూమి పౌరుడు కావడంలోని గొప్పదనం నువ్వు గ్రహించడంలేదు. నేనెంతో కాలంగా ఎందరెందరో పరదేశీయులను, ఈ జ్ఞాన భూమి పౌరులుగా మార్చి ఉన్నాను. కాని, నదిలో ఈదిన తరవాత కూడా, నీ గతాన్ని నువ్వు మరిచిపోలేదంటే ఆశ్చర్యంగా ఉన్నది. మరొకసారి నదిలో ఈది వస్తావా?'' అన్నాడు గూనివాడు.

''అదేంకుదరదు!'' అంటూ వినోదుడు ఒకసారి తన వేలికి ఉన్న ఉంగరంకేసి చూసుకున్నాడు. బంగారువిగ్రహం నుంచి తన వేలుకు చేరిన ఆ ఉంగరం కారణం

గానే, అపాయకరమైన ఆ నదీప్రభావం తనమీద పనిచేయలేదన్న విషయం అతడు గ్రహించాడు!

గూనివాడు కోపంతో చప్పట్లు చరిచాడు. ఆ చప్పట్లు కొండలలో వింత ప్రతిధ్వనులు సృష్టించాయి. ప్రతిధ్వనుల శబ్దం, తగ్గడానికి బదులు క్రమంగా హెచ్చసాగింది.

"ఇటువంటి వింత ప్రతిధ్వనులను నేనెన్నడూ వినలేదు. చాలా తమాషాగా ఉన్నది," అన్నాడు వినోదుడు.

"ఇది తమాషా కాదు, నాయనా! ప్రతిధ్వనుల శబ్దాన్ని హెచ్చుచేయడం మేము సాధించిన విజ్ఞానశాస్త్ర ఘనవిజయాలలో ఒకటి," అన్నాడు గూనివాడు.

అంతలో గుట్టలచాటు నుంచి సైనికులు కొందరు వాళ్ళకేసి రాసాగారు.

"ఆ పరదేశిని బంధించండి!" అని ఆజ్ఞాపించాడు గూనివాడు.

వాళ్ళు వినోదుణ్ణి చుట్టు ముట్టారు. కాని, వినోదుడు ఒక్క గెంతున సైనికులకు అవలనున్న బండ మీదికి దూకి, వాళ్ళకు పట్టుబడకుండా పరిగెత్తసాగాడు. అయినా, సైనికులు వదలకుండా తరమసాగారు. అతడు పరిగెత్తి, పరిగెత్తి ఆఖరికి ఒక లోయ ప్రాంతాన్ని చేరుకున్నాడు. లోయ చివర ఒక పెద్ద భవనమూ, కొన్ని ఇళ్లూ అతనికి కనిపించాయి. అక్కడికి చేరుకున్నట్టయితే సైనికుల బారి నుంచి తప్పించుకోవచ్చునన్న ఆశతో, వినోదుడు శక్తికొద్దీ పరిగెత్తాడు. అయితే, సైనికులు మరింత వేగంగా అతణ్ణి సమీపించారు.

ఇక వాళ్ళకు పట్టుబడక తప్పదన్న భయంతో, వినోదుడు సైనికుల వైపు తిరిగి చూశాడు. అంతవరకు తనను వెన్నంటి తరుముకుని వచ్చిన సైనికులు, ఆ క్షణంలో అక్కడే నిలబడి పక్కన ఉన్న మరొక చిన్న కొండ మీదికి వణికిపోతూ చూస్తున్నారు.

వినోదుడు కూడా అటుకేసి చూశాడు. అక్కడి దృశ్యం అతనికి దిగ్భ్రాంతి కలిగించింది! —(ఇంకావుంది)








## 4

[పురాతన శిథిలాల మధ్య కనిపించిన బంగారు స్త్రీ విగ్రహానికి, వినోదుడు రక్షణ ఏర్పాటు చేసి, జలపాతం దాటి జ్ఞానభూమిని చేరుకున్నాడు. అక్కడి పూజారి నుంచి తప్పించుకుని పారిపోతూన్న వినోదుణ్ణి భటులు వెంబడించారు. కొంత దూరం వెళ్ళాక, వాళ్ళు చిన్న కొండ కేసి చూస్తూ నిలబడిపోయారు. వినోదుడు కూడా అటు కేసి చూశాడు. తరవాత—]

ఆ కొండశిఖరం మీద రాజకుమారుడి లాంటి విలువైన దుస్తుల్లో, అందమైన ఐదారేళ్ళ పసివాడొకడు, చలనం లేకుండా నిలబడి ఉన్నాడు. భయంకరమైన ఒక మహామృగం, ఆ పసివాడి కేసి ప్రాకుతూ వెళుతున్నది!

''యువరాజు! యువరాజునే ఆ పవిత్ర మహామృగం భక్షించపోతున్నది!'' అనుకున్నారు తమలో తాము సైనికులు.

''యువరాజును భక్షించనున్నదని తెలిసి ఎందుకలా స్థాణువుల్లాగా నిలబడ్డారు? వెంటనే దానిని చంపండి,'' అన్నాడు వినోదుడు, మొలలో ఉన్న కత్తి మీద చేయి వేస్తూ

సైనికులు అతణ్ణి వింతగా చూడసాగారు'

అప్పుడే అక్కడికి ఒక రథం వచ్చింది. ఆ రథాన్ని ఇద్దరు స్థూలకాయులు వాయు

మనోజ్ దాస్







వేగంతో లాక్కు రావడం చూసి వినోదుడికి ఆశ్చర్యం కలిగింది.

"మహారాజుకు, జై," అంటూ రథంలో వున్న రాజుకు సైనికులు నమస్కరించారు.

రాజు మాత్రం ఆ పసివాణ్ణి చూస్తూ, "నాయనా, నన్ను వదిలి వెళుతున్నావా?" అంటూ విలపించసాగాడు.

"ఆ మృగాన్ని చంపి, తమ కుమారుణ్ణి రక్షించమని సైనికులను ఆజ్ఞాపించండి, మహారాజా!" అన్నాడు వినోదుడు.

రాజు, ఒక క్షణం వినోదుడి కేసి వింతగా చూసి, మళ్ళీ కుమారుడి కేసి విచారంగా చూడసాగాడు.

ఇంతలో మహామృగం యువరాజును సమీపించి, అతణ్ణి మింగడానికి, అగ్ని జ్వాలవంటి తన నాలుకను సాచింది. ఆ క్షణమే, వినోదుడు కత్తి దూసి మెరుపులాగా ఒక్క ఉరుకున వెళ్ళి, దాని తలను తెగవేశాడు! దాని తల ఎగిరి దూరంగా పడి, అక్కణ్ణించి దొర్లుతూ వెళ్ళి, రాజుగారి రథం పక్కన పడింది. ఆఖరుసారిగా దాని ముక్కుపుటాల నుంచి వెలువడిన అగ్నిజ్వాలకు, అప్పుడే అక్కడికి వచ్చిన గూనివాడి గడ్డం కొంత కాలిపోయింది!

"ఏమిటి? ఏం చేశావు?" అని అడిగాడు గూనివాడు వినోదుణ్ణి.

"యువరాజును మింగబోయిన భయంకర మృగాన్ని హతమార్చాను. అందుకు బహుమానంగా నాకు రాకుమారి నిచ్చి పెళ్ళి చేసి, అర్ధరాజ్యం ఇచ్చినా చాలదు. అయినా, అవన్నీ నేను కోరడం లేదు," అన్నాడు వినోదుడు.

"ఈ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి," అని భటులను ఆజ్ఞాపించాడు గూనివాడు.

"అవును, వాణ్ణి పట్టుకుని, రాజభవనం దాపులనున్న కారాగారంలో పడవేయండి," అన్నాడు రాజు.

ఈలోగా, యువరాజు కొండపై నుంచి కిందికి దిగివచ్చి, వినోదుణ్ణి ఎంతో కృతజ్ఞతగా చూడసాగాడు. భటులు,







అర్ధరాత్రి సమయంలో హఠాత్తుగా కారాగారం తలుపులు తెరుచుకున్నాయి. అంగరక్షకులు కూడా లేకుండా రాజు ఒంటరిగా లోపలికి ప్రవేశించాడు.

"నువ్వు నా కుమారుణ్ణి కాపాడినందుకు సర్వదా కృతజ్ఞుణ్ణి. నువ్వు మరణించడం నాకు ఇష్టం లేదు," అన్నాడు రాజు వినోదుడితో.

"తమ దయకు కృతజ్ఞుణ్ణి, మహారాజా! అయినా, ఎవరయినాసరే నా మరణాన్ని ఎందుకు కోరుకుంటారు?" అని అడిగాడు వినోదుడు.

వినోదుణ్ణి బంధించి కారాగారానికి నడిపించారు.

వెనకగా వస్తూన్న రాజూ, గూనివాడూ, వింతమృగం శవాన్ని ఎక్కడ పాతిపెట్టి, ఎటువంటి స్మారకమందిరం నిర్మించాలన్న విషయం గురించి మాట్లాడుకోవడం వినోదుడికి వినిపించింది.

కారాగారంలో బంధించబడిన వినోదుడికి అర్ధరాత్రి దాటినా నిద్రపట్టలేదు. ఆ భయంకర మృగం చచ్చినందుకు, రాజూ, గూనివాడూ ఎందుకు అంతగా బాధపడిపోయారు? యువరాజును కాపాడినందుకు బహూకరించడానికి బదులు తన కెందుకీ కారాగారశిక్ష విధించారు?

"ఇది జ్ఞానభూమి అన్న విషయం నీకు తెలుసు. జ్ఞానార్జనకు క్రమశిక్షణ చాలా అవసరం. క్రమశిక్షణకు అధిదేవత ఆ మహామృగం. దానిని మేము పవిత్ర మహా మృగంగా భావిస్తాము. అది రోజుకు ఒక్కటిని మాత్రమే భక్షిస్తుంది. దాని కోరిక నెరవేర్చడం మా క్రమశిక్షణలో ఒక భాగం. రాజయినంత మాత్రాన నేను క్రమశిక్షణను అతిక్రమించలేను కదా!" అన్నాడు రాజు.

"ఆ భీకరమృగం క్రమశిక్షణకు అధిదేవత ఎలా అయింది, మహారాజా!" అని అడిగాడు వినోదుడు.

"నాకు తెలిసిన రహస్యం చెబుతాను. ఆ మహామృగం కేవలం ఒక రాక్షస





జంతువు మాత్రమే. అయితే, సామాన్య ప్రజలు తాము పాటిస్తున్న క్రమశిక్షణకు ఒక అధిదేవత ఉన్నదన్న భయం వుంటే తప్ప, దానిని పాటించరు. అధిదేవత ఎంత భయంకరంగా వుంటే, ప్రజలు అంత క్రమశిక్షణను భయాసక్తులతో అచరిస్తారు!'' అన్నాడు రాజు.

''మహారాజా! మీ రథానికి గుర్రాలకు బదులు, మానవులను పూన్చమని మీ జ్ఞానం మీకు చెబుతున్నదా?'' అని అడిగాడు వినోదుడు.

రాజు వినోదుడి వెన్నుచరిచి, ''నీకు మానవులుగా కనిపించినవాళ్ళు నిజానికి గుర్రాలే. గుర్రాలకు మేము మానవరూపాలు ఇచ్చాము. అలాగే కావాలంటే మేము మనుషుల్ని గుర్రాలుగా మార్చగలం. దానినిబట్టి మాకున్న విజ్ఞానశాస్త్రశక్తిని నువ్వు గ్రహించవచ్చు,'' అన్నాడు రాజు.

''గ్రహించాను, మహారాజా!'' అన్నాడు వినోదుడు చిరునవ్వుతో.

''ఏం గ్రహించావు?'' అని అడిగాడు రాజు అనుమానంగా.

''నిరుపయోగమైన జ్ఞానంపట్ల, మీకున్న గుడ్డిదాహానికి, అధిదేవతగా ఆ క్రూరమైన రాక్షసమృగం మాత్రమే ఉండగలదన్న విషయం గ్రహించాను,'' అన్నాడు వినోదుడు.



రాజు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ''జ్ఞానభూమిలో మేము సాధిస్తూ వున్న అద్భుత కార్యాలను చూడాలంటే, నాతో రా,'' అంటూ ముందుకు నడిచాడు.

వినోదుడు మౌనంగా రాజును అనుసరించాడు.

వంకరటింకరగా ఉన్న మెట్లమీదుగా వెళ్ళి, ఇరువురూ రాజభవనం ఉపరితలం చేరారు. అక్కడ ఒక మూలలో, గుమ్మటంలాగా తెల్లగా మెరుస్తున్న బురుజు కనిపించింది. బురుజు మధ్యగా ఎరుపురంగు గుండ్రటి మరక ఉన్నది. రాజు తన చేతితో దానిని మూడుసార్లు తాకాడు. మరక మాయమై దాని స్థానంలో







ద్వారం తెరుచుకున్నది. రాజు లోపలికి ప్రవేశిస్తూ, "ఇది చాలా ప్రత్యేకమైన బురుజు. ఇందులోనుంచి, జ్ఞానభూమిలో ఏ మారుమూల ఏమి జరుగుతున్నదో ప్రత్యక్షంగా చూడవచ్చు; స్పష్టంగా వినవచ్చు. అన్నీ పక్కన జరుగుతున్నట్టే ఉంటుంది. ఇదో దీని గుండా చూడు," అంటూ గోడలో అద్దంలాగా ఉన్న స్థలం చూపాడు.

వినోదుడు అందులోకి తొంగి చూశాడు. వివిధ భాగాలుగా విభజింపబడి ఉన్న పట్టణం అతనికి కనిపించింది. కళ్ళు మిరుమిట్లు కొలిపే వెలుతురులో స్త్రీ పురుషులు ఏవేవో పనులలో నిమగ్నులై ఉన్నారు. అయినా, వాళ్ళేం చేస్తున్నారో వినోదుడికి అర్థం కాలేదు.

"వాళ్ళంతా ఏం చేస్తున్నారు, మహారాజా!" అని అడిగాడు వినోదుడు.

"ఒక్కటికాదు; వందల కొలది పనులు చేస్తున్నారు. మాకు ఎన్నో పథకాలు ఉన్నవి. అదిగో, ఎడమవైపు చూడు; అక్కడ కొందరు గణితశాస్త్రజ్ఞులు, మా రాజ్యంలో ఉన్న ఇసుకరేణువుల సంఖ్యను లెక్క కట్టడానికి కావలసిన సూత్రం కనుగొనడానికి కృషి చేస్తున్నారు!" అన్నాడు రాజు.

"అటువంటి సూత్రంవల్ల ప్రయోజనం ఏమిటి, మహారాజా?" అని అడిగాడు వినోదుడు.

"ప్రయోజనమా! జ్ఞానమే బలమన్న సంగతి నువ్వెరుగవా? ఏ జ్ఞానం ఎప్పుడు పనికివస్తుందో చెప్పలేముకదా! అందుకనే, అన్ని శాఖలకు సంబంధించిన జ్ఞానాన్నీ, సేకరించి, భద్రపరుస్తున్నాము. అదిగో, ఆ కనిపిస్తున్నదే కాంతిగోపురం! అటు చూడు. మహోన్నతమైన దానిని కనుగొనడానికి మా శాస్త్రవేత్తలు అక్కడ నిర్విరామంగా పరిశోధనలు జరుపుతున్నారు. మా పరిశోధనల కన్నింటికీ ఆ పరిశోధన తలమానికం వంటిది!" అన్నాడు రాజు.





"అటువంటి గొప్ప పరిశోధన ఏమిటి మహారాజా!" అని అడిగాడు వినోదుడు.

"అలా అడుగు చెబుతాను. కావాలను కుంటే, మేము మునుముందు ఇక్కడి నుంచే నక్షత్రాలను తుత్తునియలుగా ధ్వంసం చేయగలం! దానిని సాధించ డానికే ఆ పరిశోధన!" అన్నాడు రాజు సగర్వంగా.



"మూర్ఖత! క్రూరకృత్యం!" అన్నాడు వినోదుడు.

"ఏమిటా పొగరు?" అన్నాడు రాజు కోపంగా.

"కాకుంటే, అమాయకంగా మెరిసే ఆ చుక్కలు మీకేం అపకారం చేశాయి మహారాజా! వాటినెందుకు ధ్వంసం చేయాలి," అన్నాడు వినోదుడు.

"నువ్వు అనుకునేటంత, అమాయక మైన చిన్న నక్షత్రాలు కావు నాయనా! అవి, మన భూమికన్నా చాలా పెద్దవి! వాటి మీద మనకన్నా శక్తిసంపన్నులయిన మానవులు నివసిస్తూ వుండవచ్చు. ఏ క్షణంలోనైనా వాళ్ళు మన మీద దాడి జరపవచ్చు కదా! అందువల్ల మన రక్షణ మనం చూసుకోవడంలో తప్పేమిటి?" అని అడిగాడు రాజు.

"అర్థం లేని అనుమానంతో మీరు అద్భుతమైన మానవశక్తిని వృథా చేస్తు న్నారు, మహారాజా! మీరన్నట్టు, ఒకవేళ నక్షత్రమండలాల నుంచి మానవులే వచ్చినా, వారు ప్రేమానురాగాలతో ఎందుకు రాకూడదు? అయినా మీ పరి శోధనలకంతటికీ భయమే ఎందుకు ఆధారం కావాలి?" అన్నాడు వినోదుడు.

"భయం ఉండడంలో తప్పేమిటి? భయమేకదా మనుషు లందరినీ కలిసి కట్టుగా ఉండేట్టు చేసేది!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"బందిపోటు దొంగలకు భయపడి కూడా అందరూ అప్పటికి ఐకమత్యంగా ఉంటారు. అయినా అటువంటి ఐకమత్యం ఆశించతగినదేనా? అదిసరే, ఈ అపరాత్రి

వేళ మీ ప్రజలెందుకు నిద్రపోరు ?'' అని అడిగాడు వినోదుడు.

''నిద్రపోవడమా! నిద్రను మరిచి పోవడానికి కావలసిన ఉపాయం మేము కనుగొన్నాము! నిద్రపోకుండా పదేళ్ళ పాటు గడిపినవారిని మేము మహామృగ పతకంతో సత్కరిస్తాము,'' అన్నాడు రాజు.

''నిద్రపోకపోతే ఆరోగ్యానికి హానికరం కదా!'' అని అడిగాడు వినోదుడు.

''నిద్రలేమి కారణంగా, అనారోగ్యానికి గురి కాకుండా ఉండడానికి కూడా, మేము ఒక మార్గాన్ని కనిపెట్టాము,'' అంటూ రాజు, మరొక ప్రదేశాన్ని చూపుతూ, ''ఇదిగో, ఈ మంటపం కేసి చూడు. మా పూజారి కొందరికి విలాప సమావేశం ఏర్పాటు చేశాడు,'' అన్నాడు.

వినోదుడు అటు కేసి చూశాడు. విశాలమైన మంటపం మధ్య గోడ మీద బ్రహ్మాండమైన మహామృగం చిత్తరువు చిత్రింపబడి ఉన్నది. మంటపం నిండా జనం విచారవదనాలతో, తలలు వేలాడవేసుకుని కూర్చున్నారు. పూజారి ఎత్తయిన వేదిక మీద నిలబడి, ఇలా అన్నాడు:

''పూజనీయమైన మన మహామృగం హత్య చేయబడిన ఉదంతం మీరు వినే ఉంటారు. మన జ్ఞానభూమిలోకి అక్రమంగా ప్రవేశించి, ఆ మహామృగాన్ని చంపినవాడు సామాన్యుడు కాడు; మానవ రూపంలో ఉన్న రాక్షసుడన్న సంగతి మీకు నేను చెప్పనవసరం లేదు. మన అజ్ఞాతశత్రువు లెవరో వాణ్ణి పురికొలిపి మన మీదికి పంపి ఉంటారు. వాడు చాలా తెలివిగల దుర్మార్గుడు. మహామృగం యువరాజును కబళించనున్న సమయం చూసి, దానిని హతమార్చి, రాజుగారి సానుభూతి పొందాలని చూశాడు. అయినా, మేమువాణ్ణి బంధించాము!''

''ఆ అబద్ధాలకోరు చెబుతున్నదంతా మీరు నమ్ముతున్నారా మహారాజా!'' అని అడిగాడు వినోదుడు కోపావేశంతో.

రాజు ఏమీ మాట్లాడలేదు. వినోదుడి కేసి అనుమానంగాచూశాడు.—(ఇంకావుంది)








## 5

[యువరాజును మింగడానికి వచ్చిన మహామృగాన్ని వినోదుడు హతమార్చాడు. పూజారి ఆజ్ఞానుసారం భటులు వినోదుణ్ణి కారాగారంలో బంధించారు. అర్ధరాత్రి నమయంలో రాజు ఒంటరిగా వచ్చి, వినోదుణ్ణి రాజభవనం ఉపరితలం మీది బురుజులోపలికి తీసుకుపోయి, అక్కడి నుంచి జ్ఞానభూమిలో జరిగే వింతలనూ, విశేషాలనూ చూపసాగాడు. తరవాత—]

విలాపసమావేశంలో పాల్గొనడానికి వచ్చిన ప్రజలనుద్దేశించి మళ్ళీ, ''మనం త్వరలో మరొక మహామృగాన్ని సంపాయించగలం,'' అన్నాడు పూజారి.

''ఎలాగో ఉన్న మహామృగం పోయింది. అది లేకుంటే మనం బతకలేమా? కొత్తగా మరొక మహామృగం ఎందుకు?'' అన్నాడు కూర్చున్న పౌరులలో ఒకడు లేచి నిలబడుతూ.

''నువ్వు లేకపోయినా మునిగిపోయిందేమీలేదులే,'' అంటూ పూజారి చేతులు తట్టాడు. వెంటనే ఇద్దరు భటులు వచ్చి, ఆ పౌరుణ్ణి అక్కడి నుంచి లాక్కుపోయారు!

''పౌరులారా! మీకందరికీ ఒక శుభవార్త. పవిత్రమైన మహామృగాన్ని చంపి, మనచేత బందీగా పట్టుబడిన ఆ రాక్షసుణ్ణి హతమార్చి, మనం ఉత్సవం జరుపుకుంటాము,'' అన్నాడు పూజారి.

మనోజ్ దాస్







మౌనం వహించి, ఘోరున ఏడ్వడం ప్రారంభించాడు! కొన్ని వందల కంఠాలు, ముక్కుతూ, మూల్గుతూ, రోదిస్తూ అతణ్ణి అనుకరించాయి. కళ్ళ నుంచి కన్నీటి ధారలు వాళ్ళ చెంపలమీదుగా జారాయి. కొందరు నెత్తి, నోరూ మొత్తుకుంటూ రోదిస్తూ, బట్టలు చింపుకోసాగారు. జుట్టు పీక్కోసాగారు. ఒక్క నిమిషంలో మంటప మంతా భీకరమైన రోదనలతో ప్రతిధ్వనించింది.

వినోదుడు ఆ విషాదదృశ్యాన్ని చూసి భరించలేకపోయాడు. రాజు దానిని గ్రహించి, ఆ దృశ్యాన్ని ఆపి, "నిద్రలేమి వల్ల జనించే రుగ్మతను, మా పౌరులు ఇలా పోగొట్టుకుంటారు," అన్నాడు.

"మీ ప్రయత్నాలన్నీ ప్రయోజనం లేనివి మహారాజా! ప్రజలను ఏడ్పించడం మాని, వాళ్ళను నవ్వేవిధంగా ఎందుకు చేయకూడదు?" అని అడిగాడు వినోదుడు.

"ఏం చేయమన్నావు?" అని ప్రశ్నించాడు రాజు.

"నవ్వే విధంగా చేయమన్నాను, మహారాజా!" అన్నాడు వినోదుడు.

"నవ్వే విధంగానా! నవ్వంటే ఏమిటి?" అని అడిగాడు రాజు అమాయకంగా.

"నవ్వు, మహారాజా! నవ్వు," అన్నాడు వినోదుడు మళ్ళీ.

వినోదుడు రాజు కేసి చూశాడు. రాజు తల అడ్డంగా ఊపుతూ, "వీలుకాదు. అతడలా చేయడానికి నేను అనుమతించను," అన్నాడు.

"చాలా కృతజ్ఞుణ్ణి, మహారాజా! అయినా, రాజుగారయిన తమను సంప్రదించకుండా, ఆ పూజారి నన్ను చంపుతానని ప్రకటించడం దుర్మార్గం కాదా! మీ మీద అధికారం చెలాయించడానికి ఆ నరరూపరాక్షసుణ్ణి, ఎందుకు అనుమతిస్తున్నారు?" అంటూ వినోదుడు తన దృష్టిని మళ్ళీ పూజారి కేసి మళ్ళించాడు.

"ఇప్పుడు, మనం మన దినచర్యకు వద్దాం," అని పూజారి మూడు క్షణాలు





"అదే నేను అడుగుతున్నది. నవ్వు అంటే ఫలానా అని స్పష్టంగా చెప్పు," అన్నాడు రాజు.

"భగవంతుడా! నిజంగానే మీకు నవ్వంటే ఏమిటో తెలియదా," అని అడిగాడు వినోదుడు ఆశ్చర్యంగా.

ఆ ప్రశ్న రాజును మరింత ఇబ్బంది పెట్టింది. జ్ఞానభూమివాసులకు నవ్వంటే ఏమిటో నిజంగానే తెలియదు. వాళ్ళు ఎప్పుడూ నవ్వి ఎరుగరు!

వినోదుడు రాజుకు నవ్వి చూపాలని ప్రయత్నించాడు. కాని, నవ్వలేకపోయాడు!

"రాజా, మీరూ, మీ జ్ఞానభూమి పౌరులూ ఎంతో సాధించి ఉన్నప్పటికీ, అది ఎందుకూ కొరగాదు. ఒకవిధంగా మీరంతా దురదృష్టవంతులు; శాపగ్రస్తులనే చెప్పాలి. నేనే రాజుగా వుండి, ఏవేవో అద్భుతశక్తులు — నక్షత్రాలను ధ్వంసంచేసే శక్తితో సహా ఎన్ని అద్భుత శక్తులు ఉన్నప్పటికీ, వాటన్నిటిని సైతం, వదులుకుని హాయిగా నవ్వేశక్తిని సంపాయించడానికి వెనుకాడను," అన్నాడు ఆవేశంతో.

వినోదుడి మాటలలో ధ్వనించిన నిజాయితీ రాజుకు సంతోషం కలిగించింది. రాజు కొంతసేపు మౌనం వహించాడు.



ఉన్నట్టుండి ఒక గోపురంమీద పసుపు రంగు దీపం వెలిగింది. వెనువెంట గంటానాదం వినిపించింది.

"దీని అర్థం, ఏదో సరికొత్త పరిశోధన ఫలించిందన్నమాట. బహుశా మనోదర్పణమే అయివుంటుంది," అన్నాడు రాజు.

రాజూ, వినోదుడూ బురుజునుంచి వెలుపలికి వచ్చారు. వాళ్ళు వెలుపలికి రాగానే, ద్వారం మాయమయింది.

మెట్లమీద ఎవరో వస్తూన్న చప్పుడు వినిపించింది. వినోదుణ్ణి చాటుగా ఉండమని, రాజు చేయెత్తి సంజ్ఞ చేశాడు.

"మనోదర్పణం సిద్ధమయింది, మహారాజా!" అంటూ ఇరువురు పండితులు







అక్కడికి వచ్చి, గుడ్డతో కప్పబడి ఉన్న ఒక అద్దాన్ని రాజుగారికి అప్పగించి, "మీరు ఎవరినైనా తలుచుకుని, వారి పేరును ఉచ్చరిస్తూ, ఈ దర్పణాన్ని మూడుసార్లు తుడిచి, అందులోకి చూసి నట్టయితే, ఆ వ్యక్తి మీ గురించి ఇటీవల ఏమనుకుంటున్నదీ స్పష్టంగా కనిపి స్తుంది," అన్నారు సంతోషంగా.

"మీ కృషి ఫలించినందుకు చాలా సంతోషం! మొట్టమొదట, మన ముఖ్య శ్రేయోభిలాషి అయిన పూజారి మనసును ఇప్పుడు మనోదర్పణంలో తిలకిద్దాం," అంటూ, రాజు మనోదర్పణం మీది గుడ్డను తొలగించబోయాడు.

"ఆగండి!" అని అరుస్తూ పూజారి అక్కడ ప్రత్యక్షమై, "ఆ మనోదర్పణాన్ని మొదట నేనే ఉపయోగించాలి. పైగా అది, పూజారినైన నా సంరక్షణలోనే ఉండాలి," అన్నాడు పట్టుదలగా.

ఆ క్షణంలో ఏమి చెప్పడానికీ తోచక రాజు మౌనం వహించాడు.

"ఈ మనోదర్పణాన్ని ఉపయోగించు కోవడం రాజుగారైన మీ హక్కు అన్న సంగతి మరచిపోకండి, మహారాజా! పూజారి మనసు ఎటువంటిదో, ఈ క్షణమే తెలుసుకోండి," అంటూ చాటునుంచి, వాళ్ళముందుకు వచ్చాడు వినోదుడు.

"వీలుకాదు, కాదు, కాదు," అని అరుస్తూ, పూజారి రాజుగారినుంచి మనో దర్పణాన్ని లాక్కోబోయాడు. వినోదుడు ముందుకు దూకి పూజారికి అడ్డుపడ్డాడు.

ఇంతలో రాజు, మనోదర్పణం మీది గుడ్డను తొలగించి, పూజారి పేరు చెబుతూ దానిని మూడుసార్లు తుడిచి చూశాడు. అందులోని దృశ్యం చూసి, అదిరిపడి, అద్దాన్ని దూరంగా విసిరి, కత్తిదూసి ఒక్కక్షణంలో పూజారితలనుతెగవేశాడు!

"ఏం పని చేశారు, మహారాజా!" అన్నాడు వినోదుడు దిగ్భ్రాంతితో.

"అవును, ఆ క్షణంలో ఏం చేసిందీ నాకే తెలియడం లేదు," అంటూ కొంత







"రాజు అన్న తరవాత ఖడ్గం లేకుండా ఉండకూడదు మహారాజా," అంటూ వినోదుడు కత్తిని తీసి, రాజు నడుముకు వేలాడుతున్న ఒరలో పెట్టాడు.

"నేను మనోదర్పణంలో చూసిన విధంగా పూజారి నా శత్రువు అన్న విషయం నిజమేనా?" అని అడిగాడు రాజు కాస్త అనుమానంగా.

"సందేహమెందుకు మహారాజా, మనో దర్పణాన్ని మరొకసారి పరీక్షించి చూడండి," అన్నారు దానిని రూపొందించిన పండితులు ఏకకంఠంగా.

"మంచిసలహా!" అని రాజు వినోదుడి కేసి తిరిగి, "నువు మానవరూపంలో ఉన్న రాక్షసుడవనీ, మాకేదో హాని కలిగించే ఉద్దేశంతోనే ఇక్కడికి వచ్చావనీ పూజారి నిన్ను గురించి చెప్పేవాడు. అది ఎంత వరకు నిజమో, ఇప్పుడు మనోదర్పణం ద్వారా తెలుసుకుంటాను," అంటూ ఒక్క క్షణం కళ్ళు మూసుకుని, వినోదుడి పేరు స్మరిస్తూ మనోదర్పణంలోకి చూశాడు.

మొదట ఆశ్చర్యం చెందిన రాజు, కొంతసేపటికి ఆనందంతో నవ్వుతూ, వినోదుడికేసితిరిగి, "నువ్వు, ఒక మహాకార్యం సాధించడానికి మా జ్ఞానభూమికుండా వెళ్ళనున్నావు. ప్రయాణం సుకరం కావడానికి నువ్వు మా సహాయాన్ని కూడా

సేపు ఆగి, "నేనా అద్దంలోకి చూసేసరికి, పూజారి వికృతంగా పళ్ళు కొరుకుతూ, కత్తి దూసి నామీదికి రావడంకనిపించింది. అది బింబం అన్న మాట మరిచిపోయి, నిజమనుకుని, ఆత్మరక్షణకోసం అతణ్ణి నిజంగానే హతమార్చాను," అన్నాడు రాజు, రక్తంలో పడి ఉన్న పూజారి తల కేసి చూస్తూ, కాస్త బాధతో.

"అంటే, ఆ పూజారి మిమ్మల్ని హత మార్చాలని ఆలోచిస్తూ ఉండేవాడన్న మాట మహారాజా!" అన్నారు పండితులు ఆశ్చర్యంగా.

రాజు చేతి నుంచి, కత్తిజారి కింద పడింది.





అపేక్షిస్తున్నావు. అంతేకాని, నీకు మాపట్ల ఎటువంటి శత్రుత్వమూ, దురుద్దేశమూ లేదు. పైగా నువ్వు మా శ్రేయోభిలాషివే!" అన్నాడు రాజు.

వినోదుడి కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలాయి. "నేను మీతో చెప్పాలనుకున్న మాటలను మీరే చెబుతున్నారు మహారాజా! ఒక వరం సాధించడానికి నేను ఈ జ్ఞాన భూమిని దాటి వెళ్ళాలి. అందుకు మీ సహాయం కావాలి," అన్నాడు వినోదుడు.

రాజు కొంతసేపు మౌనం వహించి, అక్కడ ఉన్న పండితులను వెళ్ళమని సైగచేశాడు. వాళ్ళు వెళ్ళాక రాజు వినోదుడితో, "ఈ జ్ఞానభూమికి అవతల ఉన్న ప్రాంతానికి మేమెవ్వరమూ వెళ్ళలేదు. అయినా, అది ఎటువంటిదో మాకు తెలుసు. ఆ ప్రదేశానికీ, మా జ్ఞానభూమికీ మధ్య విషవాయువులు చిమ్మే పర్వత శ్రేణులు ఉన్నాయి. ఆ విషవాయువులకు తట్టుకుని ఏ ప్రాణి కూడా అవతలికి పోజాలదు," అన్నాడు.

"మహారాజా! ఆ విషవాయువులను దాటి అవతలికి వెళ్ళడానికి మీరు మాత్రమే నాకు సహాయం చేయగల సమర్థులు," అన్నాడు వినోదుడు.

"నేనెలా సహాయం చేయగలనో చెప్పు," అని అడిగాడు రాజు.



"ఒకచోట మాయమై, మరొక చోట ప్రత్యక్షమయ్యే రహస్యాన్ని నాకు ఉపదేశిస్తే చాలు మహారాజా!" అన్నాడు వినోదుడు.

రాజు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"మహారాజా, నేను నా యాత్రలో విజయం సాధించినట్టయితే, మీ కందరికీ హాయిగా నవ్వే వరాన్ని తీసుకువస్తాను," అన్నాడు వినోదుడు.

"నవ్వే వరమా! అదేమిటో నాకు స్పష్టంగా తెలియడంలేదు. అయినా అదేదో గొప్పదనే విషయం మాత్రం తెలుస్తున్నది. కాని, నువ్వు తెలుసుకోవాలనే రహస్యం చాలా విలువైనది నాయనా! అది ఈ జ్ఞాన భూమిలో ఇద్దరికి—అంటే

నాకూ, పూజారికీ మాత్రమే తెలిసిన పరమరహస్యం!'' అన్నాడు రాజు.

''ఆ రహస్యం, దానిని కనుగొన్న పండితులకు తెలుసుకదా మహారాజా,'' అని అడిగాడు వినోదుడు అనుమానంగా.

''నిజమే వారికి తెలుసు. అయితే, దానిని వారు ఉపయోగించే అవసరం లేకుండాచేశాడుపూజారి!'' అన్నాడురాజు.

''అంటే, ఆ రహస్యం తెలుసుకున్న వెంటనే పూజారి వాళ్ళను హతమార్చా డన్న మాట!'' అన్నాడు వినోదుడు.

రాజు అవునన్నట్టు తలాడించి, ''సరే, ఈ విషయంగురించితరవాత చెబుతాను,'' అన్నాడు.

సరే అన్నాడు వినోదుడు.

రాజు ఒక నిర్ణయానికి రావడానికి ఒక వారం పట్టింది. అంతలో వినోదుడు యువరాజు ప్రేమకు మరింత పాత్రు డయ్యాడు.

ఒకనాడు యువరాజును చూసి, వినో దుడు, ''ఎంతటి అందమైన యువరాజువి! అయినా నవ్వలేవు. నవ్వి చూపుదామన్నా, శాపగ్రస్తమైన ఈ జ్ఞానభూమిలో నేనే నవ్వలేకపోతున్నాను,'' అన్నాడు బాధగా.

దానిని గమనించిన రాజు, యువ రాజుతో సహా వినోదుణ్ణి తన వెంట రమ్మని, జ్ఞానభూమి సరిహద్దులవరకు తీసుకు పోయాడు. అక్కడ రాజు అతనికి మాయమయ్యే రహస్యాన్ని ఉపదేశించి, ''మాయమైన తరవాత అదేస్థితిలో ఉండడం ప్రమాదకరం. విషవాయువులు చిమ్మే పర్వతశ్రేణులు దాటిన వెంటనే మానవరూపంలో ప్రత్యక్షం కావాలి. ఈ సంగతి మరిచిపోవద్దు. అదృశ్య రూపంలో చాలాకాలం ఉండడం క్షేమంకాదు.'' అని హెచ్చరించాడు!

వినోదుడు అదృశ్యమవడానికి ముందు, రాజూ, యువరాజూ అతనికి వీడ్కోలు పలికారు. రాజు ఉపదేశించిన రహస్య సూత్రం ప్రయోగించి, వినోదుడు క్షణా లలో శక్తితరంగాలుగా మారి, అదృశ్య మయ్యాడు! —(ఇంకావుంది)








## 6

[మనోదర్పణంలో పూజారి అసలు స్వరూపాన్ని దర్శించిన జ్ఞానభూమి రాజు, ఆవేశంతో పూజారి తలను తెగవేశాడు. మనోదర్పణం ద్వారా, రాజు వినోదుడి మంచి మనసును గ్రహించి, విషవాయువులు చిమ్మే పర్వతశ్రేణులు దాటడానికి అతనికి అదృశ్యమయ్యే రహస్యం ఉపదేశించాడు. దానిని ప్రయోగించి వినోదుడు అదృశ్యమయ్యాడు. —తరవాత]

తను మాయమై, మళ్ళీ మామూలు మానవ రూపం ధరించిన విషయం తెలుసుకోవడానికి, వినోదుడికి కొంతసేపు పట్టింది. తానొక బండరాయిమీద పడి ఉన్నట్టు అతడు గ్రహించాడు, అతనికి కాళ్ళు చేతులు కదిలించలేనంత నీరసంగా ఉన్నది. మెల్లగా కళ్ళు తెరచి చుట్టు పక్కల కలయజూశాడు. అంతా చిమ్మ చీకటిగా ఉన్నది. ఎదురుగా ఒక ముని కూర్చుని ఉండడం లీలగా కనిపించింది. ముని కళ్ళు నీలమణుల్లా ప్రకాశిస్తున్నవి.

''భగవంతుడా, నేను మళ్ళీ మరొక పూజారికి పట్టుబడలేదు కదా!'' అనుకున్నాడు వినోదుడు.

''ఎవరు నువ్వు? శతాబ్దాల తరబడి మూయబడి వున్న ద్వారాన్ని దాటి, నా గుహలోపలికి ఎలా ప్రవేశించావు?'' అని అడిగాడు ముని ఆశ్చర్యంగా.

మనోజ్ దాస్



"శతాబ్దాల తరబడా! అంటే మీరు ఈ గుహలోనుంచి శతాబ్దాల తరబడి వెలుపలికి రాకుండా, ఈ గుహలోనే ఉంటున్నారా!" అని అడిగాడు వినోదుడు లేచి కూర్చుంటూ, మరింత ఆశ్చర్యంగా.

"అవును. మరి నేను అడిగిన ప్రశ్నకు సమాధానం ఏమిటి?" అన్నాడు ముని.

వినోదుడు తన వృత్తాంతాన్ని క్లుప్తంగా తెలియజేశాడు. అంతా విన్న ముని, కళ్ళు మూసుకుని, నిశ్చలంగా ధ్యానంలో కూర్చున్నాడు. గంటసేపు గడిచింది. ముని నెమ్మదిగా కళ్ళు తెరచి, వినోదుడి తలమీద చేయి వుంచి, "నాయనా, నువ్వు పవిత్రస్వరూపుడివి. అందువల్లే అదృశ్యంగా పయనిస్తున్న నువ్వు, నాకేసి ఆకర్షింపబడి ఇక్కడికి చేరావు," అన్నాడు మందహాసంతో.

వినోదుడికి ఆనంద తటాకంలో మునిగినట్టయింది. అతని నీరసమంతా చిటికలో తొలగిపోయింది. శాంతి, ఆనందం నరనరానికి ప్రసరించినట్టయింది. ఆ ముని ఎంతో మహిమాన్వితుడనీ, దయా స్వరూపుడనీ వినోదుడు గ్రహించాడు.

"రా, వెలుపలికి పోదాం. కొత్త ప్రాంతాన్ని చూపుతాను. నేనూ చూసి చాలా కాలమయింది," అంటూ ముని లేచి ముందుకు నడిచాడు. ఇరువురూ గుహాముఖానికి చేరారు. ద్వారానికి అడ్డుగా ఉన్న బండను తొలగించడానికి వినోదుడు ప్రయత్నించాడు. కాని, వెంట్రుకవాసి కూడా కదిలించలేక పోయాడు.

"ఉండు, నేను తొలగిస్తాను." అంటూ ముని ఆ బండను దండంతో తాకాడు. బండ ఎగిరి దూరంగా పడింది. ఇద్దరూ గుహ నుంచి బయటకు వచ్చారు. గుహ కొండపైన ఉన్నది. కొండకు దిగువ భాగంలో ఒక అందమైన పట్టణం కనిపించింది!

"భగవంతుడా! గుహచుట్టూ ఉన్న అందమైన చెట్టుచేమలూ, పక్షులూ ఏమయ్యాయి? కొండచుట్టూ వున్న

అరణ్యమంతా ఎలా మాయమయింది ?'' అని ముని మనసులో అనుకుంటూ వినోదుడి కేసి తిరిగి, ఆ ప్రాంత వృత్తాంతాన్ని వివరించాడు:

ఆ ప్రాంతమంతా ఒకప్పుడు భయంకరమైన అరణ్యంగా ఉండేది. ఆ ముని తప్ప, మానవమాత్రులెవ్వరూ ఆ పరిసర ప్రాంతాలలో ఉండేవారు కాదు. రాజు పెట్టే బాధలు భరించలేక పేదవాడొకడు, ఒకనాడు రాజ్యం నుంచి పారిపోయి, ఆ కొండ ప్రాంతానికి చేరాడు. అతణ్ణి ఆకలి దప్పులు విపరీతంగా బాధించసాగాయి. అప్పుడతనికి పక్కనే ఉన్న చిన్న కొండ మీద, కొన్ని పక్షులు కిలకిలమంటూ, ఒక పుచ్చకాయను తింటూ కనిపించాయి. అతడు వెంటనే కొండ మీదికి వెళ్ళి, పక్షులు సగం తిని వదలి వెళ్ళిన పుచ్చకాయను అందుకుని ఆవురావురని తినేశాడు. అతని ఆకలి దప్పులు తీరాయి.

ఆ తరవాత అతనికి ఒక అనుమానం కలిగింది. ఇంతపెద్ద పుచ్చకాయను అంత చిన్న పక్షులు ఎలా ఎత్తయిన ఈ కొండ మీదకు మోసుకురాగలిగాయి? ఇలా ఆలోచిస్తూ అతడు పరిసర ప్రాంతాలను పరిశీలనగా చూశాడు. పక్కనే ఒక తీగ కనిపించింది. ఆ కొండమీదే పుచ్చకాయ కాచినట్టు గ్రహించి ఆశ్చర్యం చెందాడు.



''బండరాళ్ళతో ఉన్న ఈ కొండ మీద పుచ్చకాయ ఎలా పండుతుంది? అని ఆశ్చర్యపడుతున్నావా ?'' అంటూ అక్కడికి వచ్చాడు, దాపులనున్న గుహలో నుంచి ఒక ముని.

''అవును, స్వామీ !'' అన్నాడు పేదవాడు.

''నేనే, నా యోగశక్తితో రోజు కొక పుచ్చకాయను సృష్టించి, పక్షులకు ఆహారంగా పెడుతున్నాను,'' అన్నాడు ముని.

''అలాగా ! అయితే నన్ను కూడా ఒక పక్షిగా మార్చేయండి, మహాత్మా! మీ దయ వల్ల పుచ్చకాయను తిని బతికిపోతాను,'' అని ప్రార్థించాడు పేదవాడు.







"అంతెందుకుగాని, కావాలంటే నీకూ సరిపడా పుచ్చకాయను పెద్దదిగా సృష్టిస్తాను," అన్నాడు ముని.

"మహాప్రసాదం!" అని పేదవాడు మునికి చేతులెత్తి నమస్కరించాడు. అయినా, అతని ముఖంలో విచారం కనిపించింది.

"నీ ఆకలి సమస్య తీరిందికదా! ఇంకా ఎందుకా విచారం?" అని అడిగాడు ముని.

"ఇంత గొప్ప ఉపకారం చేసిన తమకు ఎలా కృతజ్ఞతలు తెలియజేయాలో తెలియడం లేదు. అది నా మొదటి విచారం; నా ఆకలి సమస్య తీరింది. కాని, నా కుటుంబం గతి ఏం కావాలి! అది నా రెండవ విచారం," అన్నాడు పేదవాడు.

"నీ కుటుంబాన్ని కూడా ఇక్కడికి తీసుకురా. వాళ్ళకూ సరిపోయేలా పుచ్చకాయను సృష్టిస్తాను," అన్నాడు ముని.

పేదవాడు తల వంచి నమస్కరించాడు. కాని, అతని ముఖంలో విచారం పోలేదు.

"ఇంకా ఎందుకు విచారిస్తున్నావు?" అని అడిగాడు ముని మళ్ళీ.

"మీ దయవల్ల, నేనూ నా కుటుంబం, ఆకలిబాధ నుంచి బయటపడగలం. అయినా, ఇన్నాళ్ళు కలిసిమెలసి ఉన్న బంధుమిత్రులను ఎలా మరిచిపోగలను మహాత్మా!" అన్నాడు పేదవాడు.

"అదా నీ విచారకారణం! నీ కుటుంబంతోపాటు, నీ బంధుమిత్రులందరినీ ఇక్కడికి తీసుకురా," అన్నాడు ముని.

"కరుణాస్వరూపా! నేను ఇక్కడికి తీసుకువచ్చే, నా కుటుంబమూ, బంధుమిత్రుల సంఖ్యా క్రమంగా పెరుగుతుంది కదా! అలా పెరిగే జనాభాకు ఒక్క పుచ్చకాయ ఎలా సరిపోగలదు, అన్నదే నా అనుమానం," అన్నాడు పేదవాడు.

ముని ఒక్కక్షణం మౌనం వహించి, "నేను గుహలోకి వెళ్ళి తపస్సు చేసుకో





వాలనుకుంటున్నాను. నా తపస్సు ఎంత కాలం కొనసాగుతుందో, ఆ భగవంతుడికే ఎరుక. అయితే, నేను ఇక్కడ వదిలి వెళ్ళే యోగశక్తి ప్రభావంవల్ల, మీకు రోజూ ఒక పుచ్చకాయ లభ్యమవుతూనే ఉంటుంది. రోజూ సాయంకాలం, మీలో ఒకరు ఇక్కడికి వచ్చి, రేపు ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో గట్టిగా చెప్పి వెళ్ళండి. మర్నాటి ఉదయానికల్లా కావలసినంత పరిమాణంలో పుచ్చకాయ ఈ తీగకు వేలాడుతూ వుంటుంది. దానిని మీరు పంచుకుని తినండి. దానిని భుజించినవారికి రోజల్లా ఆకలిదప్పులు ఉండవు,'' అన్నాడు.



పేదవాడు వెళ్ళి, తన భార్యాబిడ్డలనూ, బంధుమిత్రులనూ వెంటబెట్టుకుని వచ్చాడు. కొండపాదతలంలోని పచ్చిక మైదానంలో చిన్న గుడిసెలు వేశారు. ముని అక్కడ చేరినవారికి, ''భగవంతుడి కరుణవల్ల మీకు ఆకలిసమస్య తీరింది. సత్యాన్ని సాధించడమే మానవ జీవిత లక్ష్యం. ఇప్పటి నుంచే మీ లక్ష్యసాధనకు పూనుకోండి,'' అని ఉపదేశించాడు.

వాళ్ళకు ధ్యానపద్ధతులు నేర్పించి, ముని కొండ మీది గుహలోపల ప్రవేశించి తపస్సు చేయడం ప్రారంభించాడు. శతాబ్దాలు గడిచిపోయాయి.

మునీశ్వరుడు చెప్పిన ఉదంతమంతా విన్న వినోదుడు, ''మహాత్మా! ఇప్పుడు మన కళ్ళ ఎదుట కనిపించే పట్టణం, ఆనాటి శరణార్థుల వారసులు నిర్మించినదే అయివుంటుంది. గుహ ముఖద్వారంలో, నాకు పుచ్చతీగ కనిపించింది. ఇంకా వాళ్ళు పుచ్చకాయను తీసుకుంటూ ఉన్నా ఆశ్చర్యం లేదు,'' అన్నాడు.

''పట్టణంలో ప్రవేశించి, అక్కడి విశేషాలు తెలుసుకుందాం, రా,'' అంటూ ముందుకు నడిచాడు ముని.

వినోదుడు అయన్ను అనుసరించాడు. కొండపైనుంచి కిందికి ఉన్న బాటకిరువైపులా పూలచెట్లూ, తీగలూ ఉన్నాయి.



మునీ, వినోదుడూ కొంతసేపటికి కొండ పాదతలంలో ఉన్న పట్టణ ద్వారం దగ్గరికి చేరారు. రంగురంగుల తలపాగాలు ధరించిన, దృఢకాయులైన ఇద్దరు భటులు, శూలాలు పట్టుకుని ద్వారానికి కాపలా కాస్తున్నారు. ద్వారానికి వెలుపల గుంపుగా జనం ఉన్నారు.

''మేము దూరప్రాంతం నుంచి వచ్చిన యాత్రికులం. కొండ మీదికి వెళ్ళి చూడడానికి అనుమతించరా?'' అన్నాడు గుంపులో నుంచి ఒకడు.

''అనుమతించం. అద్భుతమైన పుచ్చకాయ లభించే ఈ కొండ మీదికి మా నాయకుడు మాత్రమే వెళ్ళడానికి అర్హుడు. ఆయన కూడా, ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో అజ్ఞాపించడానికి, రోజుకు ఒక్కసారి మాత్రమే కొండపైకి వెళతాడు,'' అన్నారు భటులు.

భటుడి మాటలు విని, ''ఆ నాయకుడు, మొదట శరణార్థిగా వచ్చిన పేదవాడి సంతతివాడై వుంటాడు,'' అంటూ ముని ముందుకు నడిచాడు.

ఇరువురూ ద్వారం దాటి లోపలికి వెళ్ళారు.

''మనం లోపలికి వస్తున్నప్పటికీ భటులు అకేపించలేదేమిటి?'' అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''మనం ఇప్పుడు అదృశ్యంగా నడుస్తున్నాము. మన మాటలు కూడా ఎవరికీ వినిపించవు,'' అన్నాడు ముని.

వినోదుడు అమితాశ్చర్యం చెందాడు.

వారిరువురూ ఒక వీధిగుండా వెళ్ళి, ముఖద్వారం మీది శిలాఫలకం మీద 'నిశ్శబ్దం' అని రాయబడి వున్న పెద్ద మంటపాన్ని చేరారు. కొందరు అధికారులు, చుట్టూ వున్న పచ్చికమైదానంలో అటూ ఇటూ పచార్లుచేస్తూ, అప్పుడప్పుడు మంటపం లోపలికి తొంగి చూస్తున్నారు.

''ఈ స్థలం నాకు జ్ఞాపకం ఉన్నది. ఆ కాలంలో ఇక్కడ పెద్ద తోట ఒకటి ఉండేది. ఇక్కడ ఏం చేయాలో కూడా





వాళ్ళకు వివరించి వెళ్ళాను. రా, ఇప్పుడేం చేస్తున్నారో చూద్దాం,'' అంటూ ముని మంటపం లోపలికి ప్రవేశించాడు.

వరుసగా వేయబడిన పడకకుర్చీ వంటి ఆసనాలలో, స్త్రీ పురుషులు చాలామంది పడుకుని నిద్రపోతున్నారు. కొందరు గాఢ నిద్రలో గట్టిగా గుర్రు పెడుతున్నారు. ఎవరెవరు ఎంతసేపు నిద్రపోయేదీ, అధికారులు లెక్కగడుతున్నారు. అక్కడి వాతావరణాన్ని పరిశీలించి చూశాక— మరీగట్టిగా గుర్రుపెట్టి నిద్రించినవారికి ప్రోత్సాహం లభిస్తుందనీ, కొంతకాలం గడిచాక ఇదంతా లెక్కగట్టి, ఎక్కువ కాలం నిద్రించి, అందరికన్నా గట్టిగా గుర్రుపెట్టినవారికి సన్మానం చేస్తారనీ, ముని గ్రహించాడు.

ఆయన కోపావేశంతో, అక్కడ అదమరచి నిద్రపోతూన్నవాళ్ళను జుట్టుపట్టి లాగి కిందికి తోశాడు. వినోదుడు కూడా మునిని అనుసరించి అలాగే చేయసాగాడు. కొంతసేపటికల్లా, హఠాత్తుగా నిద్రలేచిన వారి కేకలతో మంటపమంతా అల్లకల్లోలమయింది. అధికారులు ఏం చేయడానికీ తోచక అలాగే ఉండిపోయారు.

ముని బయటకు వచ్చాడు. వినోదుడు ఆయన వెనక నడుస్తూ, ''మహాత్మా, వారి పట్ల మీ ఆగ్రహానికి కారణం తెలుసుకోవచ్చా,'' అని అడిగాడు.

''నేను వాళ్ళ పూర్వులకు కళ్ళు మూసుకుని ధ్యానం చేయడం ఎలాగో నేర్పి వెళ్ళాను. వాళ్ళేమో ధ్యానం మాట మరిచిపోయి, ఇప్పుడు నిద్రపోవడంలోనూ, గుర్రుపెట్టడంలోనూ ఒకరితో ఒకరుపోటీపడుతున్నారు,'' అన్నాడుముని.

ఇరువురూ కొంతసేపటికి ఆలయం లాంటి కట్టడం ముందు చేరారు. ఆలయ ప్రాంగణంలో పట్టణ అధికారుల సభ జరుగుతున్నది. వాళ్ళలో యువకుడైన పట్టణ నాయకుడు కూడా ఉన్నాడు. వినోదుడూ, మునీ అదృశ్యంగా వాళ్ళ మధ్యకు చేరారు. ఆలయం తలుపులు మూయబడ్డాయి. —(ఇంకావుంది)






## 7

[జ్ఞానభూమి నుంచి అదృశ్యమైన వినోదుడు, మరొక కొత్త ప్రదేశంలో కొండపై ఉన్న గుహ లోపలి ముని సమక్షానికి చేరాడు. మునీ, వినోదుడూ గుహ నుంచి బయటకు వచ్చి, కొండ పాదతలంలో ఉన్న పట్టణంలో అదృశ్యంగా నడుస్తూ అక్కడి విశేషాలను చూస్తూ, ఒక ఆలయ ప్రాంగణంలో ప్రవేశించారు. ఆలయం తలుపులు మూయబడ్డాయి. —తరవాత]

ఆలయంలో ఉన్నవారిలో పొడవుగా ఉన్న పెద్దమనిషి, ''అదృష్టవశాత్తు, ఈ సంవత్సరం కూడా మనం అన్ని 'పాపాలనూ' పట్టి బంధించగలిగాము. అందరూ దృఢకాయులే. ఈ ఆహారంతో దేవత తప్పక ఆనందిస్తుంది,'' అన్నాడు ఎంతో సంతోషంగా.

''ఒక్కసారి వాళ్ళను చూద్దామా?'' అన్నాడు నాయకుడు.

ఆ పెద్దమనిషి వారినందరినీ ఒక బోను వద్దకు తీసుకుపోయి, ''వీడు దురాశ, వాడు క్రోధం, బెదురు చూపులు చూస్తున్న ఆ పొడవాటి గడ్డంవాడు లోభం,'' అంటూ బోనులోని ముగ్గురు దృఢకాయులను చూపాడు.

ఆ తరవాత, అధికారులు, ఆ ముగ్గురినీ బలి చేయడానికి ఉపయోగించనున్న తళతళ మెరుస్తూన్న కత్తిని చూశారు.

మనోజ్ దాస్







మరి కొంతసేపు పట్టణ సంచారం చేసేసరికి, వారికెన్నో సంగతులు తెలియ వచ్చాయి: పట్టణంలో పుచ్చకాయ వ్యాపారం బ్రహ్మాండంగా సాగుతున్నది. రోజూ సాయంకాలం పట్టణం నాయకుడు, కొండమీదికి వెళ్ళి—పొరుగు ప్రాంతాల నుంచి వచ్చిన వారితో సహా ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో చెప్పి వచ్చే వాడు. పుచ్చకాయ అద్భుతంగా ప్రత్యక్ష మయ్యే తీరూ, దాని రుచీ రోజూ వేలకొలది మందిని ఆకర్షిస్తున్నది. ఉదయసూర్యుడి కిరణాలలో తళతళమెరిసే వింత పుచ్చ కాయను దర్శించడానికీ, అందులో ఒక ముక్కను తీసుకోవడానికీ—పొరుగూళ్ళ నుంచి వచ్చేవారినుంచి బాగా డబ్బు వసూలు చేస్తున్నారు. ఇలా తమ పూర్వీ కుడికి లభించిన వరాన్ని ఉపయోగించి, సులభంగా ధనార్జన చేస్తూ, వాళ్ళు పొద్దస్త మానం నిద్రపోతూ, యేటా అమాయకు లైన పరదేశీయుల్ని కొందరిని పట్టి, వారికి దుర్గుణాలని పేర్లుపెట్టి పట్టణదేవతకు బలి యిస్తూ ఉత్సవం జరుపుకుంటు న్నారు!

సూర్యాస్తమయ సమయానికి మునీ, వినోదుడూ పట్టణ సంచారం ముగించి కొండమీదకు చేరారు. పుచ్చతీగ పక్కన ఉన్న బండమీద ఇరువురూ కూర్చున్నారు.

''ఈ పట్టణాన్ని సర్వనాశనం చేయాలి!'' అన్నాడు ముని కోపావేశంతో.

ఆయన మాటలు వినోదుడికి తప్ప మరెవ్వరికీ వినిపించలేదు. వినోదుడు ముని కేసి ఆశ్చర్యంగా చూశాడు.

''నేను మనసులలోని దురాశ, క్రోధం, లోభం మొదలైన దుర్గుణాలను దేవత ఎదుట త్యజించమన్నాను. ఈ దుర్మార్గులు పరదేశీయులైన కొందరు అమాయకులను పట్టి బంధించి, వాళ్ళకు దురాశ, క్రోధం, లోభం అని పేర్లు పెట్టి దేవతకు బలి ఇస్తున్నారు!'' అంటూ ముని గుడి ప్రాంగణం వదిలి కోపంగా వెలుపలకు నడిచాడు.



కొంతసేపటికి ముదురురంగు దుస్తులతో నాయకుడు కొండ ఎక్కి రావడం వాళ్ళకు కనిపించింది. యువకుడయిన ఆ నాయకుడు హుషారుగా ఈలవేస్తూ కొండ మీదికి వచ్చి, ఇన్నాళ్ళూ గుహద్వారానికి అడ్డంగా ఉన్న పెద్ద బండ అవతల పడి వుండడం చూసి ఆశ్చర్యపడ్డాడు. తరవాత గుహ లోపలికి తొంగిచూసి, "రేపు ఇరవైవేల మందికి సరిపడా పుచ్చకాయ కావాలి," అన్నాడు గట్టిగా.

"ఇరవైవేలమందికి సరిపడానా? మీ పట్టణ జనాభా అంత ఉన్నదా?" అని అడిగాడు ముని.

నాయకుడు వెనుదిరిగి చూశాడు. ఎదురుగుండా ఒక బండ మీద ముని కూర్చుని ఉన్నాడు. వినోదుడు పక్కనే నిలబడి ఉన్నాడు.

"మీరెవరు? ఇక్కడ మీకేం పని?" అని అడిగాడు నాయకుడు.

"ఈ గుహలో ఒక ముని ఉండేవాడనీ, ఆయనే ఈ వింత పుచ్చకాయ వరం ఇచ్చాడనీ నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు ముని.

"ఆ విషయం విని ఉన్నాను. అయినా, అదంతా కట్టుకథ అనుకున్నాను," అన్నాడు నాయకుడు.

"రోజూ పుచ్చకాయ ప్రత్యక్షమవడం సత్యమైనప్పుడు, ఆ వరం ప్రసాదించిన ముని ఉదంతం మాత్రం కట్టుకథ ఎలా అవుతుంది?" అన్నాడు ముని.





నాయకుడు వెంటనే సమాధానం చెప్ప లేకపోయాడు.

ముని వినోదుడి కేసి తిరిగి, ''ఇదీ నాయనా, ప్రస్తుత విచిత్రపరిస్థితి. పువ్వుల అందం చూసి ఆనందిస్తారు. కాని వాటి అందచందాలను తీర్చిదిద్దిన సృష్టికర్తను గురించి ఆలోచించడం గానీ, పట్టించుకోవడం గానీ చేయరు,'' అన్నాడు బాధగా నిట్టూరుస్తూ.

అప్పుడు నాయకుడు, ''మహాత్మా! మీరుగుహనుంచి బయటికి రావడంచాలా ఆనందకరమైన విషయం. ఇంతకాలం గుహ జీవితం గడిపారు. ఇక నుంచి మీకు సకల సౌకర్యాలూ గల బ్రహ్మాండమైన భవనాన్ని నివాసంగా ఏర్పాటు చేస్తాం. ఎన్నేళ్ళుగానో మీరు ఆహారం చూసి ఉండరు. నాతో రండి. మీకు పంచభక్ష్య పరమాన్నాలతో విందు ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు నవ్వుతూ.

''నేను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఏవేవో మాట్లాడుతున్నావు. మీకు ఇరవైవేలమందికి సరిపడా పుచ్చకాయ అవసరమేమిటి?'' అన్నాడు ముని కోపంగా.

''మేము పదిహేనువేలమంది ఉన్నాం. చుట్టుపక్కల నుంచి ఇవాళ అయిదువేల మంది వచ్చారు. వాళ్ళకూ పుచ్చకాయ కావాలి. అందుకు తగిన విధంగా మేము వాళ్ళ నుంచి పైకం వసూలు చేస్తాం. కావాలంటే మీకూ ఆ ఆదాయంలో ఒక వాటా ఇస్తాం. ఇప్పుడు నాకొక బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది! పుచ్చకాయతో పాటు మీరు కూడా కొండ మీద కూర్చుని కొంతసేపు దర్శనం ఇచ్చినట్టయితే, ఆ దృశ్యం చూపి సులభంగా మరింత డబ్బు వసూలు చేయగలం. ఏమంటారు?'' అన్నాడు నాయకుడు పట్టరాని ఉత్సాహంతో.

''నోర్ముయ్,'' అన్నాడు ముని.

ఆ తరవాత ముని కొంతసేపు మౌనంగా కూర్చున్నాడు. సూర్యాస్తమయం కాబో





తున్నది. ఆకాశంలో పక్షులు బారులు బారులుగా ఎగురుతూ గూళ్ళకు చేరుకుంటున్నాయి.

''కొండ మీద పుచ్చకాయను సృష్టించి అద్భుతం ప్రదర్శిస్తే, ఈ ప్రజలు దాని వెనక ఉన్న దివ్యశక్తిని గ్రహించి, దైవ స్పృహగలవారుగా ఉండగలరనీ, ధర్మ బద్ధంగా తమ జీవితాలను దిద్దుకోగలరనీ ఆశించాను. అయినా, రోజూ సూర్య చంద్రులనూ, అంతరిక్షంలో వేలాడుతూన్న అనంతకోటి నక్షత్రగోళాలను చూసినా వీరి మనసులకు అద్భుతం అనిపించదు. అటువంటి వాళ్ళు కేవలం ఒక వింత పుచ్చకాయలో పరమార్థాన్ని గ్రహించగలరని ఆశించడం, నాదే పొరబాటు,'' అని బాధపడసాగాడు ముని తనలోతాను.

కొంతసేపటికి ముని కనుబొమలు ముడిపడ్డాయి. ''రేపు ఆఖరుసారిగా నేను మీకొక బ్రహ్మాండమైన పుచ్చకాయను సృష్టిస్తాను. అది పగిలి బద్దలై మీమీద పడుతుంది. అదే మీ పట్టణాన్ని సర్వనాశనం చేస్తుంది. ఇక వెళ్ళు!'' అని నాయకుణ్ణి ఆజ్ఞాపించాడు ముని కోపావేశంతో.

నాయకుడు కొండ దిగి పట్టణం కేసి నడిచాడు.



''మహాత్మా, మీ బెదిరింపు వాళ్ళలో మంచి మార్పు తీసుకురాగలదనుకుంటాను. వాళ్ళు తమ పొరబాటు గ్రహించగలరు. ఇన్నాళ్ళు తమకు ఉన్న అమూల్య అవకాశాన్ని దుర్వినియోగం చేసినందుకు వాళ్లు బాధపడగలరనుకుంటాను,'' అన్నాడు వినోదుడు.

''అంత తొందరగా వాళ్ళు మారుతారనుకోను. వెర్రి వెయ్యివిధాలు. కావాలంటే నువ్వు వెళ్ళి వాళ్ళిప్పుడేమి చేస్తున్నారో చూసి రా,'' అన్నాడు ముని.

వినోదుడు కొండ దిగి పట్టణం చేరుకున్నాడు. అది పున్నమిరేయి. పిండారబోసినట్టు వెన్నెల కాస్తున్నది. పట్టణం



మధ్యగా ఉన్న ఒక మైదానంలో జనం గుమికూడి ఉన్నారు. వేదికలాంటి ఎత్తయిన స్థలం నుంచి నాయకుడు మాట్లాడుతున్నాడు. వినోదుడు ఆ గుంపును సమీపించాడు. నాయకుడి ప్రసంగం ఇలా సాగుతున్నది:

"ముని సవాలును మనం ఎలాగైనా ఎదుర్కొని తీరాలి. అతని పథకాన్ని కొనసాగనీయకూడదు. అందుకు ఒక్కటే మార్గం. రేపు వేకువజామునే మన పట్టణ ప్రజలూ, చుట్టుపక్కల ప్రాంతాలవాళ్లూ అందరం కలిసికట్టుగా కొండ దగ్గరికి చేరాలి. కొండ మీది నుంచి పుచ్చకాయ బద్దలై కిందికి పడగానే ఆ ముక్కలను అందుకుని అందరం తినేయాలి. ఆ తరవాత, ఆ పుచ్చకాయ ముక్కలు మన పట్టణాన్ని ఎలా నాశనంచేయగలవో చూద్దాం."

నాయకుడి ఉపన్యాసం విని అందరూ అమితోత్సాహంతో ఆమోదసూచకంగా తలలూపారు.

ఆ క్షణం నుంచే ఉదయం రానున్న అపాయాన్ని ఎదుర్కొడానికి ప్రజలందరూ ఆయత్తం కాసాగారు. పొద్దున పుచ్చకాయ ఎక్కువగా తినడానికి అనువుగా, వాళ్ళందరూ ఆ రాత్రి ఉపవాసం చేయడానికి నిశ్చయించారు. ఇరుగుపొరుగు ప్రాంతాల నుంచి వచ్చిన వేలకొలది ప్రజలు కూడా ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఉత్సాహంగా ఎదురు చూడసాగారు.

ఆ పట్టణప్రజల అజ్ఞానానికి బాధపడుతూ, వినోదుడు ముని దగ్గరికి చేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది.

తూర్పున అరుణరేఖలు పొడిచేసరికల్లా, వేలకొలది ప్రజలు కొండ దిగువకు చేరి, నోళ్ళు తెరుచుకుని వరుసలు వరుసలుగా నిలబడ్డారు. కొండమీద, ఇంచుమించు ఆ కొండంత పరిమాణంలో బ్రహ్మాండమైన పుచ్చకాయ సూర్యకాంతిలో తళతళ మెరుస్తూ ప్రజల హృదయాలలో భయోత్సాహాలను కలిగించింది.





హఠాత్తుగా పుచ్చకాయ వేనవేల ముక్కలుగా బద్దలై జనం మీద పడింది. ప్రజలు పట్టరాని ఉత్సాహంతో కేకలు పెడుతూ ఒకరితో ఒకరు పోటీపడి, పుచ్చ కాయ ముక్కలను తినసాగారు. కింద ప్రవహించిన రసాన్ని జుర్రుకుని తాగేశారు. గంటసేపట్లో అక్కడక్కడా పుచ్చకాయ ముక్కల పైతొక్కలు తప్ప మరేమీ మిగలకుండా ఖాళీ చేసేశారు.

ఆ తరవాత, ప్రజలందరూ గుమికూడి, తమనుతాము గొప్పగా ప్రశంసించుకుంటూ ఒక తీర్మానం నెరవేర్చారు. కొంతసేపటికి పొరుగూరువాళ్ళు క్రమంగా అక్కణ్ణించి వెళ్ళసాగారు. మధ్యాహ్నంకల్లా కొండ కింది ప్రాంతం దాదాపు నిర్మానుష్య మయింది. పట్టణవీధుల్లో కూడా జన సంచారం పలచబడింది.

పట్టణప్రజలలో, కొందరు, పుచ్చ కాయను అమితంగా తినడంవల్ల అజీర్ణం పట్టుకున్నది. ఈ రోజుతో పుచ్చకాయ రావడం ఆగిపోయింది. రేపటి నుంచి తమ ఆహారం ఏమిటి? అన్న దిగులు కొందరికి పట్టుకున్నది. తరతరాలుగా వాళ్ళకు తెలిసిన జీవనోపాధి ఒక్క పుచ్చ కాయ వ్యాపారం మాత్రమే. అందువల్ల రేపటి నుంచి బతకడం ఎలా అన్నది పెద్దసమస్య అయింది.

వాళ్ళలో పెద్దలు కొందరు, "మునీశ్వ రుడు, పుచ్చకాయ బద్దలై పట్టణాన్ని నాశనం చేస్తుందనే కదా అన్నాడు. అంటే—ఆ పుచ్చకాయ బద్దలై పట్టణాన్ని నాశనం చేస్తుందని కాదు భావం. బద్దలైన పుచ్చకాయే ఆఖరుది; రేపటి నుంచి పుచ్చ కాయ రాదు కాబట్టి, పట్టణం దానంతట అదే నశించిపోతుందనే అర్థం," అని వ్యాఖ్యానించసాగారు.

సాయంకాలమయింది. ఉదయం నుంచి అదృశ్యంగా ఉంటూ ఈ విశేషా లన్నీ చూసిన మునీ, వినోదుడూ—విచారవదనాలతో ఉన్న పట్టణ ప్రజలను వదిలి, వాళ్ళకు తెలియకుండా దూరంగా వెళ్ళిపోయారు. —(ఇంకావుంది)








## 8

[జ్ఞానభూమి నుంచి వినోదుడు మరొక కొత్తప్రాంతాన్ని చేరుకుని అక్కడి మునితో కలిసి అదృశ్యంగా పట్టణ సంచారం జరిపాడు. ఆ ప్రజల ధనాశకూ, అజ్ఞానానికీ ముని బాధపడ్డాడు. ముని సృష్టించిన వింత పుచ్చకాయ బద్దలై ప్రజలపై బడింది. ఆ ముక్కలను అందరూ తినేశారు. విచారగ్రస్తమైన పట్టణాన్ని వదలి మునీ, వినోదుడూ వెళ్ళిపోయారు. తరవాత—]

వినోదుడు వింత జలపాతం దాటి అవతలికి వెళ్ళి కొన్ని రోజులే అయినప్పటికీ, బంగారులోయ రాజు మాత్రం ఓర్పును కోల్పోయాడు. వినోదుడు ఎప్పుడెప్పుడు తిరిగి వస్తాడా అని ఎదురుచూడసాగాడు. వినోదుడి రాకను తనకు వెంటనే తెలియజేయడానికి అనువుగా కొండల మీదా, ఎత్తయిన చెట్ల మీదా భటులను ఏర్పాటు చేశాడు!

మామూలుగా రాజు భోజనానికి కూర్చున్న సమయంలో, మరీ లడ్డూలను చూసీ చూడగానే, ఆయనకు బంగారుస్త్రీ విగ్రహం జ్ఞాపకం వచ్చేది. మరుక్షణమే అక్కణ్ణించి ఉరుకులతో పరుగులతో శిధిలాల మధ్య ఉన్న బంగారు విగ్రహం దగ్గరికి చేరుకునేవాడు. తీరా అక్కడ చేరాక, భోజనం సగంలోనే వదిలివచ్చామే అని తెగ బాధ పడేవాడు. అందువల్ల,

మనోజ్ దాస్







తను అలా వదిలివచ్చిన భోజనాన్ని దాదాపు ముప్పై పళ్ళాలతో తాను ఉన్న స్థలానికి తీసుకురావడానికి ముప్పైమంది సేవకులను ఏర్పాటు చేశాడు!

రాజు తరచూ మంత్రినీ, మహాజ్ఞానులనూ చూసి, "ఇప్పుడు నేనెలా ఉన్నాను?" అని అడిగేవాడు.

రాజు అందంగా కనిపించడానికి ఎటువంటి శ్రద్ధ తీసుకుంటున్నదీ వారికి బాగా తెలుసు. మామూలుకన్నా ఆయన ఇప్పుడు రెండింతలు భోజనం చేస్తున్నాడు. రోజూ శుభ్రమైన వెన్నతో స్నానం చేస్తున్నాడు. మూడు రోజులకోసారి జుట్టు కత్తిరించుకుంటున్నాడు. రెండు రోజులకోసారి మీసం కత్తిరించుకుంటూ, రోజుకు రెండుసార్లు సంపెంగనూనె రాసుకుంటున్నాడు. విలువైన దుస్తులతోపాటు, ప్రతి వేలుకూ రెండేసి ఉంగరాలూ, మెడనిండా వజ్రాలహారాలూ ధరిస్తున్నాడు. బంగారు స్త్రీ విగ్రహానికి ప్రాణం వస్తే, ఆమెను వివాహమాడడానికే ఈ ప్రయాసలన్నీ!

"మీరు అపురూప సౌందర్యంతో వెలిగిపోతున్నారు చండమార్తాండ మహాప్రభూ!" అనేవాళ్ళు మంత్రీ, మహాజ్ఞానులు. ఇటువంటి మామూలు మాటలు రాజుకు అంతగా తృప్తికలిగించడం లేదని గ్రహించిన మహాజ్ఞానులు, ఇంకా పెద్దపెద్ద మాటలతో, కొత్త కొత్త ఉపమానాలతో పొగడి రాజుగారి మన్ననలు పొందడానికి ప్రయత్నించేవారు. "అందమైన పుష్పంలాగా ఉన్నారు ప్రభూ!" అని కొందరంటే, "రంగురంగుల సీతాకోకచిలుకలా వెలిగిపోతున్నారు మహాప్రభూ!" అని మరికొందరనేవారు. "మీ అందం ఇంద్రధనుస్సులా మెరిసిపోతోంది మహారాజా!" అని ఇంకా కొందరు పొగడేవారు.

రాజాస్థానంలో ఉన్న ఇద్దరు కవులు రాజుగారి అందాన్ని వర్ణిస్తూ కొత్త కొత్త ఉపమానాలను మహాజ్ఞానులకు అందించి, వారి నుంచి ధనం పుచ్చుకునేవారు.





కవులు కొత్త పదజాలం కూడా రూపొం దించారు. ఆ మాటలకు అర్థం తెలియక పోయినా, కాస్త గంభీరంగా వినిపిస్తే చాలు—రాజు ఎంతగానో పొంగిపోయే వాడు. కొనగోటితో గొప్పగా మీసం దువ్వు కునేవాడు!

మహాజ్ఞాని అయిన వృద్ధమంత్రి ఒక నాడు రాజుతో, "చండమార్తాండ మహా ప్రభూ, ఆ బంగారు విగ్రహం ఒక్కసారి నవ్వితేచాలు; వెంటనే ఆమె కళ్ళు తెరుచు కుంటాయి; గుండె కొట్టుకోవడం ప్రారం భిస్తుంది. కంటిచూపూ, హృదయం ఉన్న ఏ అందాలరాశిగాని తమ సౌందర్యాన్ని చూసి ప్రేమించకుండా ఉండజాలదు!" అన్నాడు.

రాజు తల పంకించాడు. మంత్రి మాటలు బాగానే ఉన్నాయి. అయినా, ఆ విగ్రహాన్ని నవ్వేట్టు చేయడం ఎలా? ఈ సమస్యను పరిష్కరించడానికి రాజు తీవ్రంగా ఆలోచించాడు. రాజ్యంలోని పేరుమోసిన హాస్యగాళ్ళందరినీ రప్పిం చాడు. ఖజానాలోని ధనాన్ని ధారాళంగా వెచ్చించి వాళ్ళకు వింత వింత దుస్తులు కుట్టించాడు. వాళ్ళందరినీ విగ్రహం ముందుకు నడిపించి నాట్యం చేయ మన్నాడు; చేష్టలు చేయమన్నాడు. వాళ్ళు అలాగే చేశారు; అలిసిపోయారు. అయినా,



భటులు కత్తి చూపి బెదిరించి వాళ్ళు స్పృహతప్పి పడిపోయేవరకు ఆడించారు. అయినా విగ్రహం నవ్వలేదు.

ఇక ఇది లాభం లేదనుకుని రాజు, విగ్రహాన్ని నవ్వించినవారికి గొప్ప బహు మానం ఇస్తామని చాటింపు వేయించాడు.

ఒకనాటి రాత్రివేళ, బంగారు విగ్రహం ముందు బ్రహ్మాండమైన మెరుపు మెరి సింది. విగ్రహం నవ్వడమే అలా మెరిసిం దని భావించిన కాపలాభటుడు, రాజు దగ్గరికి పోయి బంగారు విగ్రహం నవ్విం దని చెప్పాడు. భోజనం చేస్తూన్న రాజు, ఉన్నపళంగా బయలుదేరి పరుగు పరు గున బంగారు విగ్రహం దగ్గరికి చేరాడు.







విగ్రహాన్ని ఎంత పరిశీలించి చూసినా, రాజుకు నవ్వు కనిపించలేదు. ఆయన కాపలాభటుడి కేసి తిరిగి, "నీకు మంచి బహుమానం ఇస్తాను. అయితే, బంగారు విగ్రహం నవ్వినప్పుడు మొట్టమొదట చూసే హక్కూ, అర్హతా, అధికారం నాకే ఉన్నాయి. కాబట్టి ఇప్పుడే నీ కళ్ళు పీకిస్తాను," అన్నాడు ఆగ్రహంతో.

కాపలాభటుడు భయంతో గడగడ వణికిపోయాడు. అదృష్టవశాత్తు రాజు అజ్ఞ నెరవేర్చబడేలోపలే, వృద్ధమంత్రి అక్కడికి వచ్చి, "చండమార్తాండ మహా ప్రభూ! మన రాజ్యానికి ఒక మహా మాంత్రికుడు వచ్చాడు. ఈయన గొప్ప గొప్ప అద్భుతాలు ప్రదర్శించగల మహనీయుడు!" అన్నాడు.

రాజు మాంత్రికుడి కేసి చూశాడు.

"అవును మహాప్రభూ! తమరు అనుమతిస్తే నేనెన్నో అద్భుతాలు చూపగలను," అంటూ చేతులు తట్టాడు మంత్రి వెంట వచ్చిన మాంత్రికుడు.

మరుక్షణమే మాంత్రికుడి శిష్యుడు అక్కడి కొక ఎలుగుబంటిని లాక్కొచ్చాడు.

"ఇప్పుడు మీరేం చూస్తున్నారు మహారాజా?" అని అడిగాడు మాంత్రికుడు.

"ఎలుగుబంటిని మచ్చిక చేసుకోవడం అద్భుతం కాదు. కంపుకొడుతున్నది, తీసుకుపో దాన్ని అవతలికి," అన్నాడు రాజు కోపంగా.

"చిత్తం మహారాజా, అయినా, దాన్ని అట్టేసేపు ఎలుగుబంటిగా వుంచను," అంటూ మాంత్రికుడు నవ్వుతూ, ఎలుగుబంటిని కాలితో తన్నాడు. అది కింద పడుకున్నది. మరుక్షణమే మాంత్రికుడి శిష్యుడు దాన్ని ఒక దుప్పటితో కప్పేశాడు. మాంత్రికుడు మంత్రదండంతో అక్కడక్కడా తడుతూ, దానిని మూడుసార్లు చుట్టివచ్చాడు. దుప్పటి కింద ఎలుగుబంటి తన్నుకుంటున్నట్టు అనిపించింది. మాంత్రికుడు కొంతసేపు ఏవేవో మంత్రాలు





వల్లించి చివరికి 'హాం....ఫట్' అన్నాడు కనుబొమలు ముడివేసి. మరుక్షణమే ఒక మనిషి దుప్పటిలో నుంచి బయటికి దూకి ముందుకువచ్చి నిలబడ్డాడు. వాణ్ణి రాజు పరిశీలనగా చూశాడు. వాడిలో ఎలుగుబంటి లక్షణాలు గాని, గురుతులు గాని ఏమాత్రం లేవు. రాజు అమితాశ్చర్యం చెందాడు!

అది రాత్రి సమయం కావడం వల్ల అక్కడ అంతగా జనం లేరు. విగ్రహానికి కాపలా ఉన్న భటులూ, రాజు సగంలో వదిలివచ్చిన భోజనం తీసుకువచ్చిన సేవకులూ ఉన్నారు. వాళ్ళు రాజుతో మాట్లాడకూడదు. కొందరు అస్థానోద్యోగులున్నప్పటికీ, రాజు మాటకు ఎదురాడడం క్షేమం కాదని వారికి తెలుసు. కాబట్టి ఒక్కరు కూడా నోరు కదపలేదు. మాంత్రికుడు ఎలుగుబంటిని మనిషిగా మార్చాడని రాజు నమ్మాడు. తామూ నమ్ముతున్నట్టు మంత్రులూ, అస్థానోద్యోగులూ నటించారు. మనిషికి ఎలుగుబంటి వేషం తగిలించి తీసుకువచ్చి, మాంత్రికుడు మోసం చేశాడేమో అని కొందరు అనుమానించారు. కాని, ఆ మాట పైకి చెప్పడానికి సాహసించలేక పోయారు!

ఆ కొత్త మనిషి ఇంకా ఎలుగుబంటి లాగానే గుర్రుపెడుతున్నాడా? అని చూడడానికి వచ్చిన మంత్రి ముక్కును వాడు గాయపరిచాడు!

''మహాప్రభూ, ఇతడు త్వరలోనే గుర్రుపెట్టడం మానేయగలడు. రేపీపాటికి చక్కగా మాట్లాడగలడు. ఆపైన గోళ్ళకు బదులు మనలా కత్తులూ, కఠారులూ ఉపయోగించగలడు!'' అన్నాడు మాంత్రికుడు.

అస్థానోద్యోగులు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

''మహాప్రభూ, ఎలుగుబంటిని మనిషిగా మార్చగల నా మంత్రశక్తిని గురించి మీరేమనుకుంటున్నారు?'' అని అడిగాడు మాంత్రికుడు.





రాజు కొంతసేపు ఆలోచించి, తల పంకించి, "నేనిప్పుడేమి అనుకుంటున్నదీ చెబుతాను విను. కావాలంటే నువ్వు ఇంకొక ఎలుగుబంటిని కూడా మనిషిగా మార్చగలవు. అయినా అవసరం లేదు. మాదిరికి ఒక్కటి చాలు!" అన్నాడు.

"ఆహా! ఆహా! ఎంత వివేకం! ఎంత వివేకం!" అన్నారు ఆస్థానోద్యోగులు ఏక కంఠంగా.

"మహాప్రభూ, ఎలుగుబంటిని మనిషిగా మార్చిన నేను బంగారు విగ్రహాన్ని స్త్రీగా మార్చలేనా?" అనిఅడిగాడుమాంత్రికుడు.

"ఎందుకు మార్చలేవూ? ఆహా, ఆనందంతోఎగిరి గంతేయాలని ఉన్నది. అయినా ఎగురలేకున్నాను!" అన్నాడు రాజు.

"మీ బొజ్జ మీకు భారంగా ఉన్నది మహారాజా! అయినా, బంగారు విగ్రహం ప్రాణాలతో లేచి వచ్చేసరికి, మీ బొజ్జ కరిగిపోగలదని హామీ ఇస్తున్నాను," అన్నాడు మాంత్రికుడు.

"మహామాంత్రికా! ఇప్పుడే నీ మాయా దుప్పటితో ఆ విగ్రహాన్ని మూసేద్దాం. నీ ఇష్టానుసారం ఆ విగ్రహాన్ని మంత్ర దండంతో కొట్టు, వద్దనను. నన్ను ఇంత కాలం కాచుకునేట్టు చేసిన అకతినురాలికి అప్పుడే నా కష్టం తెలిసివస్తుంది!" అన్నాడు రాజు.

"అది సాధ్యం కాదు మహారాజా! ఆ విగ్రహానికి ప్రాణం తెప్పించడానికి మనం వేరొక మార్గం అనుసరించాలి. అందుకు మీరు ఒక వారంపాటు ఉపవాసం ఉండాలి. ఆ తరవాత, విగ్రహానికి వెనుక ఉన్న గుహలో మీరు ధ్యానం చేయాలి. అప్పుడే మనం అనుకున్నది సాధించగలం," అన్నాడు మాంత్రికుడు చాలా గంభీరంగా.

"ఉపవాసమా! ఒకవారం వరకా?" అన్నాడు రాజు భయపడిపోతూ.

"వారానికి ఒక్క నిమిషం కూడా తగ్గడానికి వీలుకాదు మహాప్రభూ," అన్నాడు మాంత్రికుడు.





"లడ్డూలు మాత్రం తీసుకోవచ్చా?" అన్నాడు రాజు ఆశతో.

"సాధ్యంకాదు మహాప్రభూ," అన్నాడు మాంత్రికుడు.

"అడపాదడపా కోడి మాంసమయినా తినవచ్చా?" అన్నాడు రాజు సగం తిని వదిలివేసిన పళ్ళాలకేసి విచారంగా చూస్తూ.

"కోడి కాదు కదా, కోడి గుడ్డు కూడా తాకడానికి వీలులేదు," అని మాంత్రికుడు రాజుకేసి జాలిగా నవ్వుతూ, "ఈ ఉపవాసం పూర్తయ్యాక, నేను ప్రాణాలు తెప్పించనున్న అప్సరస సరసన కూర్చుని పంచభక్ష్య పరమాన్నాలను ఆరగించే అదృష్టాన్ని ఊహించి చూడండి మహాప్రభూ! అంతేకాదు. అప్సరసను పెళ్ళాడిన మొట్టమొదటి మహారాజుగా మీ పేరు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతుంది!" అంటూ రాజు వెన్ను తట్టాడు.

రాజు అంగీకార సూచనగా, మౌనంగా తలాడించాడు.

"మీకు సానుభూతి కనబరుస్తూ, నేను కూడా మీతోపాటు ఉపవాసం ఉండాలనుకుంటున్నాను," అని మాంత్రికుడు ఇంకేదో అనబోయేంతలో, "మేమందరం కూడా రాజుగారితో పాటు ఉపవాసం ఉంటాం!" అన్నారు మంత్రీ, ఆస్థాన ఉద్యోగులూ ఏకకంఠంగా.

"చాలా బాగుంది! చండమార్తాండ మహా ప్రభువులవారే ఉపవాసం ఉంటూన్నప్పుడు, ఎవరికి మాత్రం తినాలని బుద్ధి పుడుతుంది? అయినా ఈ వారమంతా నేను రాజుగారికోసం చాలా శ్రమించవలసి ఉన్నది. కాబట్టి నేను ఆహారం లేకుండా బలహీనమైపోకూడదు. ప్రభువులవారు అపార్థం చేసుకోకుండా ఉన్నట్టయితే, ఆయన ఆహారాన్నంతా ఈ వారంపాటు నేనే భుజించాలి. అప్పుడే మనం అనుకున్న పని నిరాటంకంగా సఫలమవుతుంది," అన్నాడు మాంత్రికుడు.

"అలాగే, నీ ఇష్టానుసారమే చెయ్," అన్నాడు రాజు. —(ఇంకావుంది)








# 9

[వినోదుడు వింత జలపాతం దాటి వెళ్లాక, బంగారులోయ రాజ్యానికి ఒక మాంత్రికుడు వచ్చి, రాజు సమక్షంలో ఒక ఎలుగుబంటిని మనిషిగా మార్చి, అదేవిధంగా బంగారు విగ్రహాన్ని కూడా స్త్రీగా మార్చగలనని రాజును నమ్మించాడు. రాజూ, మంత్రీ, జ్ఞానులూ ఒక వారం పాటు ఉపవాసం వుండాలని షరతుపెట్టాడు. రాజు అందుకు అంగీకరించాడు. తరవాత—]

మర్నాడు ఉదయం రాజు మంత్రినీ, మహాజ్ఞానులనూ రప్పించి, "మీరందరు కూడా మాతోపాటు ఒకవారం ఉపవాసం ఉండడానికి అనుమతిస్తున్నాం," అన్నాడు. ఆ క్షణం నుంచి వాళ్ళెవ్వరూ రాజభవనం వదిలి వెళ్ళకుండా కట్టడి చేశాడు.

ఒకరోజు గడిచేసరికి అందరూ ఆకలితో అలమటించిపోసాగారు. అయినా, ఎవరూ ఏమాత్రం బయటపడకుండా ఎంతో గంభీరంగా గడిపారు.

రాజు భోజన మందిరంలో మామూలుగా రాజుకు చేసే వంటకాలన్నిటినీ, మాంత్రికుడు సుష్టుగా భుజించసాగాడు. అతడు తినగా మిగిలినవాటిని, శిష్యుడు క్షణాలలో ఖాళీచేసేవాడు.

మూడవరోజుకల్లా రాజు చాలా నీరసించిపోయాడు. నాలగవరోజు మూలగడం

మనోజ్ దాస్







ఎలాగో ఒకవిధంగా వారం రోజులు గడిచిపోయాయి. ఎనిమిదవరోజు వేకువ జామున రాజును వెన్నతో స్నానం చేయించి, విలువైన దుస్తులు ధరింపజేసి, ఆభరణాలతో అలంకరించారు.

మాంత్రికుడు మంత్రినీ, మహాజ్ఞానులనూ పిలిచి, "ఇప్పుడు ప్రభువులవారిని నేను విగ్రహానికి అవలనున్న గుహ లోపలికి తీసుకుపోవాలి. ఆయన అక్కడే తన ఉపవాసం విరమిస్తారు. మీరందరూ మీ మీ ఇళ్ళకు వెళ్ళి హాయిగా భోజనం చేయండి. నేను గుహలోపల ప్రవేశించి ధ్యానంలో కూర్చుంటాను. అలా ఎంత కాలం ఉంటానో నాకే తెలియదు. అయితే, ఈ మధ్యకాలంలో ఒక్క ప్రభువులవారు మాత్రమే నా దగ్గరికి రావడానికి అర్హులు. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే ఈక్షణం నుంచి మీరు కూడా రాజుగారిని సమీపించకూడదని హెచ్చరిస్తున్నాను. నేను ప్రభువులవారిమీద మాయాశక్తిని ప్రయోగిస్తున్నాను. ఆ సమయంలో మీరు ప్రభువులవారిని సమీపించారంటే మీ ఆయువు క్షీణిస్తుంది!" అన్నాడు.

కొంతసేపటికి మంత్రీ, మహాజ్ఞానులూ తమ తమ ఇళ్ళకు పరుగులు తీశారు. రాజుకు లేచి నిలబడడానికి కూడా శక్తి లేదు. ఆయన్ను భటులు మంచం మీద

ప్రారంభించాడు. అప్పుడు గుక్కెడు పళ్ళ రసం మాత్రం తీసుకోవడానికి అనుమతించాడు మాంత్రికుడు.

అప్సరసను పెళ్ళాడిన తరవాత పట్టనున్న భోగభాగ్యాలను గురించి మాంత్రికుడు వర్ణించేప్పుడల్లా, రాజు చిన్నగా నవ్వేవాడు. ఆయన కళ్ళనుంచి బాష్పాలు రాలేవి. బంగారులోయ కొండలలో నిక్షిప్తంగా బంగారం ఉందన్న విషయం రాజుకు తెలుసు. విగ్రహానికి ప్రాణం వచ్చి తనను పెళ్ళాడితే, ఆ బంగారం అంతా ఎక్కడ ఉన్నదీ ఆమె తనకు చెప్పగలదన్న ఆశతో రాజు కాలం గడప సాగాడు!





పడుకోబెట్టి విగ్రహం వద్దకు మోసుకు పోయారు.

"తనకు తెలిసిన బంగారు నిధుల రహస్యాలతో ఈ అప్సరస ప్రభువులవారిని వివాహమాడడానికి ఒక్క రోజే ఉన్నది!" అన్నాడు మాంత్రికుడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలు వినగానే రాజు ఉత్సాహంతో, శక్తిని రాబట్టుకుని కూర్చుని, మాంత్రికుడి చేయి పట్టుకుని లేచినిలబడి, విగ్రహానికి వెనక ఉన్న గుహకేసి నెమ్మదిగా నడిచాడు. రాజుగారి అంగరక్షకులను సైతం, మాంత్రికుడు కొండ దిగువ ఉన్న మైదానంలోనే ఉండమన్నాడు.

"ఆ బంగారు విగ్రహాన్నే మింగేద్దామా అన్నంత ఆకలితో ఉన్నాను. అయినా, ఆమెను నేను పెళ్ళాడాలికదా," అన్నాడు రాజు మాంత్రికుడితో.

రాజూ, మాంత్రికుడూ గుహలో ప్రవేశించే లోపల, సేవకులు మామూలుగా రాజు భుజించే రకరకాల వంటకాలను అక్కడికి చేర్చారు. మాంత్రికుడి శిష్యుడు చెప్పినప్రకారం పళ్ళాలను అమర్చి, అక్కడి నుంచి వాళ్ళు వెళ్ళిపోయారు. పళ్ళాలనిండుగా ఉన్న పదార్థాలను చూసి రాజు పరమానందం చెందాడు. ఆయన ముఖం కొత్త కాంతితో వెలిగిపోయింది. "ఆహా! నేనిప్పుడు తినవచ్చు కదా?" అని అరిచాడు రాజు.

"తొందరపడకండి మహారాజా, పూజలో ముఖ్యమైన తతంగం ఇప్పుడే జరగాలి.





అదిగో, గోడ మధ్యగా ఉన్న బిలం మీకు కనిపిస్తున్నదా ప్రభూ! మీరు మోకాళ్ళ మీదికి వంగి పాకుతూ ఆ బిలంగుండా అవతలికి వెళ్ళి నేను చెప్పినట్టు చేయండి. అది చాలా సులభం. ఆ తరవాత మీరు ఇష్టానుసారం తినవచ్చు. ఆ పైన....'' అని మాంత్రికుడు ఏదో చెప్పబోయేంతలో, ''అప్సరసను వివాహమాడవచ్చు.'' అన్నాడు రాజు ఎంతో ఉత్సాహంతో.

''అవును ప్రభూ! ఇప్పుడు మీరు మీ బట్టలు తీసి పక్కగా పెట్టి ఆ బిలంలో ప్రవేశించండి,'' అన్నాడు మాంత్రికుడు.

''నేను బట్టలెందుకు విప్పాలి?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

''అది ఈ పూజలో ఒక భాగం మహాప్రభూ! మీకు త్వరలో పట్టనున్న అదృష్టాన్ని మరిచిపోకండి. అటువంటి మహద్భాగ్యం కోసం బట్టల్నే కాదు; నా చర్మాన్ని వొలిచి ఇవ్వమన్నా నేను వెనుకాడను!'' అన్నాడు మాంత్రికుడు.

వేరే మార్గం కనిపించక రాజు అందుకు అంగీకరించాడు. మాంత్రికుడూ, శిష్యుడూ రత్నాలు తాపిన రాజుగారి చొక్కానూ, మణులుపొదిగిన తలపాగానూ, బంగారపు టంచు పంచెనూ ఒక్కొక్కటిగా విప్పారు. కంఠహారాలూ, ఉంగరాలూ మొదలైన ఆభరణాలన్నిటినీ తీసుకున్నారు.

ఆ తరవాత ఇరువురూ కలిసి, రాజును పట్టి బిలం లోపలికి నెట్టారు. ''కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిగా ఉన్నది,'' అని గొణిగాడు రాజు.

''కొంతకాలానికి అదే నీకు అలవాటై పోతుందిలే,'' అన్నాడు మాంత్రికుడు.

''ఇక్కడే అలవాటుపడాలని మేము కోరడం లేదు. త్వరగా నీ పూజా తతంగం పూర్తిచెయ్,'' అని అరిచాడు రాజు.

మాంత్రికుడు క్షణాల్లో, అతికించుకున్న గడ్డాన్ని లాగి అవతలపారేసి, రాజు దుస్తులూ, ఆభరణాలూ ధరించి, తలపాగా పెట్టుకుని, ''పూజాతతంగం పూర్తయింది!'' అన్నాడు గట్టిగా నవ్వుతూ.





"నాకు ఆకలేస్తున్నది. ఆ పళ్ళాలను అందివ్వు." అని అరిచాడు రాజు.

మాంత్రికుడు బిలంగుండా తొంగి చూశాడు. అతణ్ణి చూసి రాజు ఆశ్చర్యంతో, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"చండమార్తాండ మహాప్రభువును!" అన్నాడు మాంత్రికుడు.

"అర్థరహితంగా మాట్లాడకు. నువ్వు రాజువయితే, మరి నేనెవర్ని?" అన్నాడు రాజు.

"మాంత్రికుడివై వుంటావు!" అన్నాడు రాజు వేషంలోని మాంత్రికుడు.

"నాకు మంత్రతంత్రాలు తెలియవు. తెలిసుంటే ఈ పాటికి ఈ గుండ్రాళ్ళను లడ్డూలుగా మార్చి ఉండేవాణ్ణి కదా!" అన్నాడు రాజు.

"మరిచిపోయి వుంటావు. రాజభవనంలో నిధి నిక్షేపాలు దాచే భోషాణం తాళంచెవి ఎక్కడపెట్టానో నేను మరిచిపోయాను. అలాగే నువ్వు కూడా మంత్రతంత్రాలుమరిచిపోయి వుంటావు. ఆ తాళంచెవి ఎక్కడున్నదో చెప్పు. చెప్పావంటే నీకు ఇష్టమైన ఆహారపానీయాలూ, వెలుతురూ లభించేట్టు చేస్తాను." అన్నాడు మాంత్రికుడు.

"నేను చెప్పను. నీ మోసం తెలిసిపోయింది. కదలలేనంత నీరసం వచ్చే



వరకు నన్ను పస్తువుంచి, మోసం చేస్తావా. నీచుడా!" అని అరిచాడు రాజు.

శిష్యుడు పళ్ళాన్ని పట్టుకున్నాడు. రాజు వేషంలోని మాంత్రికుడు అందులోని వంటకాలను తినసాగాడు.

"నా ఆహారం నాకివ్వరా." అని అరిచాడు రాజు కోపంగా.

మాంత్రికుడు రాజుకు ఒక లడ్డూ ఇచ్చి, "నువ్వు భోషాణం తాళంచెవి వున్నచోటు చెప్పేంతవరకు, నీకు రోజుకు ఒక లడ్డూమాత్రమే!" అన్నాడు.

"ఆ రహస్యం చెప్పానంటే, ఒక్క లడ్డూ కూడా ఇవ్వకుండా నన్ను చంపగలవు. నేనెంత మూర్ఖుణ్ణి! నిన్ను







నమ్మానే," అని గొణుక్కుంటూ, లడ్డూను తినసాగాడు రాజు.

• • •

వింతపుచ్చకాయ బద్దలై పడటంతో, విచారగ్రస్తులైన పట్టణప్రజలను వదలి—మునీ, వినోదుడూ ఒక అరణ్య ప్రాంతాన్ని చేరారు.

"అదిగో, నింగినేలా కలుస్తున్న దూర తీరంలో నీలిరంగు కొండలు కనిపిస్తున్నవి కదా! వాటిని దాటి వెళ్ళడం చాలా కష్టం. అయితే—మీ రాజ్యంలోని బంగారు స్త్రీ విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకోవడానికి, నువ్వు సాగిస్తూన్న ఈ ప్రయాణంలో విజయం సాధించాలంటే, ఆ కొండలను దాటి వెళ్ళక తప్పదు," అన్నాడు ముని వినోదుడితో.

"అదృశ్యమయ్యే రహస్యం నాకు తెలుసు. జ్ఞానభూమి రాజు ఆ రహస్యం నాకు ఉపదేశించాడు. ఇక్కడ అదృశ్యమై ఆ కొండలు దాటి ప్రత్యక్షం కాగలను!" అన్నాడు వినోదుడు.

"ఆ విద్య మానవప్రపంచం వరకే పరిమితం. నువ్విప్పుడు ప్రవేశించనున్నది మానవప్రపంచం కాదు. అక్కడివాళ్ళు మనుషులు లాగా కనిపించినప్పటికీ మానవులుకారు," అన్నాడు ముని.

"అయితే, అక్కడికి కాలినడకనే వెళతాను," అన్నాడు వినోదుడు.

"అది కూడా సాధ్యమయ్యే పనికాదు. ఎందుకంటే, నువ్వు ఎంతకాలం నడిచినా ఈ అరణ్యాన్ని దాటలేవు. అక్కడివారిని చేరుకోవాలంటే రహస్యమార్గంగుండా వెళ్ళాలి," అన్నాడు ముని.

"మహాత్మా! ఇటువంటి పరిస్థితిలో మీరుతప్ప నాకెవ్వరూ సహాయం చేయలేరు. కరుణించి మీరే నన్ను అక్కడికి చేర్చాలి," అన్నాడు వినోదుడు మునికి నమస్కరిస్తూ.

"అలాగే," అని, ముని చిరునవ్వు నవ్వి, వినోదుడి చేయి పట్టుకుని కొండల కేసి నడవసాగాడు.

వినోదుడికి ఒక్క క్షణం మైకం కమ్మి నట్టయింది. మరుక్షణం అతనికి పక్షి ఈకలా తేలిగ్గా ఎగిరిపోతున్నట్టు అనిపించింది. అతని మనసులో ఎటువంటి చలనమూ లేకుండా ప్రశాంతంగా తోచింది. హాయిగా కళ్ళు మూసుకున్నాడు.

ఇలా ఎంతసేపు ముని వెంట నడిచినదీ వినోదుడికి తెలియలేదు. ఎవరో మెల్లగా వెన్నుపై చరిచినట్టయి, కళ్ళు తెరిచాడు. వినోదుడు చిన్న కొండపై ఒక బండమీద ముని సమీపంలో కూర్చుని ఉన్నాడు. అప్పుడప్పుడే తెల్లవారుతున్నది. తూర్పు ఆకాశపు మేఘాలు సముద్రపు నురగలాగా ఆ ప్రాంతాలకు వింత అందాలను సమకూరుస్తున్నవి.

కొండ దిగువ మైదానంలో కొన్ని వృక్షాలు కనిపించాయి. వాటి బోదెలు తాటి బోదెల్లా వున్నాయి. కాని కొమ్మలూ, రెమ్మలూ కనిపించడం లేదు. అవి మేఘాల మధ్యగా దూసుకుపోయి, ఆకాశాన్ని అంటుతున్నవి.

"ఇంత ఎత్తయిన వృక్షాలను నేనెప్పుడూ చూడలేదు!'' అన్నాడు వినోదుడు.

''అవి ఎప్పుడూ అంత ఎత్తు వుండవు. ప్రాతఃకాలంలో కొంతసేపు మాత్రమే. ఆకాశంలో దేవకుమారులు మధురఫలాలు అందుకోవడానికి అనువుగా అంత ఎత్తుకు ఎదుగుతాయి.'' అన్నాడు ముని.

వినోదుడు మళ్ళీ మైదానం కేసి చూశాడు. అప్పటికే ఆ వృక్షాలు మామూలు ఎత్తుకు వస్తూ వుండడం గమనించి, ''ఇదొక అద్భుతమైన ప్రపంచం!'' అన్నాడు వినోదుడు.

''మనం ఇప్పుడు మానవలోకం సరిహద్దులలో ఉన్నాము. ఉత్తమమైన జీవనం సాగించేవారు ఇక్కడ నివసిస్తున్నారు. త్వరలో వాళ్ళలో కొందరిని నువ్వు చూడగలవు.'' అన్నాడు ముని.

ఇంతలో ఒక కీచుకంఠస్వరం వినిపించింది. వినోదుడు వెనుకకు తిరిగి, అక్కడి దృశ్యం చూసి, భయాశ్చర్యాలతో నిలబడిపోయాడు. —(ఇంకావుంది)








# 10

[బంగారులోయ రాజ్యానికి వచ్చిన మాంత్రికుడు, రాజును మోసంతో బంగారు విగ్రహం వెనక ఉన్న గుహలో బంధించి, రాజు దుస్తులూ, ఆభరణాలూ తాను ధరించి వెలుపలికి వచ్చాడు. వింత జలపాతం దాటి వెళ్లిన వినోదుడు, ముని సహాయంతో మానవలోక సరిహద్దు ప్రాంతంలో వున్న స్వప్నభూమిని చేరుకుని, అక్కడ ఒక వింతదృశ్యం చూశాడు.—తరవాత]

దాపులనున్న చిన్న అగాధంలో వికార స్వరూపు డొకడు, చేతిలో పొడవాటి గొట్టం పట్టుకుని ఉన్నాడు. వాడికి ఎదురుగా పెద్ద బంతి ఆకారంలో ఒక వస్తువు ఉన్నది. వాడి చేతిలోని గొట్టం కొస ఆ బంతికి తగిలించబడి ఉన్నది. వాడు గొట్టం రెండవ కొసను పళ్ళతో బిగించి ఊదుతున్నాడు. వాడలా ఊదేప్పుడు వాడి నోటిలో వింత కాంతి ప్రకాశిస్తున్నది.

ఆ బంతి కొంతసేపటికి రక్తం లాగా ఎర్రగానూ, మరి కొంతసేపటికి కాటూకలా నల్లగానూ మారి, ఒక విధమైన పొగను వెలికి చిమ్మింది. వాడు ఆనందంతో ముందుకువంగి ఆ పొగను ఆత్రంగా పీల్చ సాగాడు. వాడి కళ్ళు గుడ్లగూబ కళ్ళు లాగా మెరుస్తున్నవి.

''ఏమిటా వింత దృశ్యం?'' అని అడిగాడు వినోదుడు మునిని.

మనోజ్ దాస్







"ఈ అగాధం స్వప్నభూమిలో ఒక భాగం. భూమి మీది ప్రజలు కనే కలలు ఇక్కడ ప్రతిబింబిస్తాయి. ఒకేరకం కలలు కుదింపబడి ఒక రూపంగా ఏర్పడతాయి. ఇప్పుడు నువ్వు చూస్తున్నది కొన్ని వేల కలల సంక్షిప్తస్వరూపం. తమను తెలివిగలవాళ్ళమనుకునేపరమమూర్ఖులు కనే కలల సంక్షిప్తరూపం ఇది. అలాంటి కలలు కనేవాళ్ళు ప్రపంచాన్ని విషమయం చేస్తారు. ధనార్జనకోసం అడ్డదారులు తొక్కుతారు. ఆహారపదార్థాలు కల్తీ చేస్తారు. అక్రమంగా ధరలు పెంచి అమాయక ప్రజలను దోచుకుంటారు. ఏవో లాభాలు గడించినట్టు ఆ సమయానికి ఆనందంతో పొంగిపోతారు. అలా చూడు వాడెలా మురిసిపోతున్నాడో!" అన్నాడు ముని.

వినోదుడు మళ్ళీ అగాధం కేసి చూశాడు. ఆ వికారస్వరూపుడు పరమానందంతో పొగను పీలుస్తూ, పందిలాగా గుర్రుపెడుతున్నాడు. వాడు పొగను పీల్చేకొద్దీ కడుపు పెద్దదై బానలా తయారయింది. అయినా, వాడు పొగను పీల్చడం మానడం లేదు. క్రమంగా వాడి ముఖంలో ఆనందానికి బదులు చెప్పరాని బాధ చోటు చేసుకున్నది.

"వాడేదో బాధ అనుభవిస్తున్నట్టున్నదే!" అన్నాడు వినోదుడు.

"అవును, చెప్పరాని బాధను అనుభవిస్తున్నాడు. ఎదుటివాళ్ళ మంచి కోరని పాపిష్ఠివాళ్ళ కందరికీ ఇటువంటి గతే పడుతుంది. అలాంటి వాళ్ళు మంచి గాలిని పీల్చలేరు," అన్నాడు ముని.

కొంతసేపటికి వాడు కిందపడి విలవిలా తన్నుకోసాగాడు. వినోదుడు ఇక వాడి కేసి చూడలేక, తన చూపులను అగాధం చివరికి మరల్చాడు.

అక్కడ నేల మీది నుంచి వింత కాంతిరేఖలు బాణాల్లా పైకి దూసుకు వస్తున్నాయి. ఆ కాంతిరేఖలను అనుకుని ఒక బ్రహ్మాండమైన వటవృక్షం ఉన్నది.





కొన్ని కాంతిరేఖలు ఆ వృక్షం సగంవరకే వెళ్ళి కాంతిని కోల్పోతున్నవి. ఒకే ఒక కాంతి రేఖ మాత్రం వృక్షం చిటారు కొమ్మలదాకా ఎగబ్రాకుతున్నది. అయినా, రాబందులవంటి వింతపక్షులు కొన్ని కాంతిరేఖను పైకి పోనీయకుండా రెక్కలతో విసురుతూ ఆర్పేస్తున్నవి!

"అక్కడి కాంతులు ప్రజల శాంతి సౌఖ్యాలు కోరేవాళ్ళ కలలకు సంకేతాలు. శక్తిహీనులు కనే కలలు ఫలించకుండా సగంలోనే ఆగిపోతాయి!" అన్నాడు ముని.

"కాంతిరేఖను ఎగబ్రాకనీయకుండా ఆపక్షులు ఎందుకు అటంకపరుస్తున్నవి?" అని అడిగాడు వినోదుడు.

"ప్రజలు శాంతి సౌఖ్యాలతో జీవించడం చూసి సహించలేని దుష్టశక్తులకు సంకేతాలు ఆ పక్షులు. ఆ దుష్టశక్తులను అధిగమించాలంటే మరింత పట్టుదలతో, ధైర్యసాహసాలతో పోరాడాలి." అని వివరించిన ముని, కొంతసేపు మౌనం వహించి, "ఇప్పుడు మనం సంతృప్త శాంతభూమిని ప్రవేశించాలి. అందుకు ఈ అగాధాన్ని ఒక్క అంగలో దాటాలి. నువు దాటగలవా?" అని అడిగాడు ముని.

"తమ కరుణవుంటే తప్పక దాటగలను," అన్నాడు వినోదుడు.

"మంచిది. ఆ నమ్మకం వుంటే చాలు—ఎంతటి ఘనకార్యాన్నయినా







సాధించవచ్చు. ఇలా వచ్చి, నా చేయి పట్టుకుని, కళ్ళు మూసుకుని, బలాన్నంతా కూడదీసుకుని నాతో పాటు ముందుకు దూకు," అని వినోదుడి చేయిపట్టుకున్నాడు ముని.

వినోదుడు కళ్ళు మూసుకుని, ముని చెప్పినట్టే, బలంకొద్దీ ముందుకు దూకాడు. వానచినుకులా ఎంతో తేలికగా అవతలి గట్టుమీదపోయి వాలాడు వినోదుడు. కళ్ళు తెరిచి చుట్టూ కలయజూశాడు. కనుచూపు మేరకు అందాల ఉద్యానవనం. దూరంగా వింత వింత రంగులతో ఇంద్రధనుస్సు తళతళ మెరుస్తున్నది. పక్షులు కలకలా రావాలు చేస్తున్నవి. మేఘాలు తలకు చేరువగా రంగురంగుల పుష్పాల్లాగా తేలుతున్నవి. మెల్లమెల్లగా వీచే పిల్లగాలులు వినోదుడికి ఎంతో హాయిని కలిగించాయి. అతడు ముని కోసం చుట్టుపక్కల కలయజూశాడు. ముని జాడ లేదు. మామూలుగా అయితే ముని కనిపించక పోతే, వినోదుడు విచారగ్రస్తుడయ్యేవాడే. అయితే, ఇప్పుడతనిలో ఎలాంటి విచారమూ లేదు. అక్కడి వాతావరణం విచారానికి అతీతమైనదని వినోదుడు గ్రహించాడు. ఆ ప్రశాంత వాతావరణానికి అతని మనసు పులకరించింది. అప్పుడతడు తను బాల్యంలో నేర్చుకున్న పాటలను మధురంగా ఆలపించసాగాడు. కొంత సేపటికి సూర్యోదయమయింది. వినోదుడు పాటపాడుతూ పక్కకు తిరిగి చూశాడు. అతని పక్కనే అపురూప సౌందర్యవతి అయిన ఒక యువతి కూర్చుని వున్నది! వినోదుడు పాడడం ఆపి, ఆమె కేసి వింతగా చూడసాగాడు.

"దయచేసి పాట ఆపకు. పాడు, పాడు," అని ప్రాథేయపడిందాయువతి.

వినోదుడు ఆమె కేసి చూస్తూ కొంత సేపు అలాగే ఉండిపోయాడు. ఆ తరవాత, "చాలా వింతగా ఉన్నదే!" అన్నాడు వినోదుడు తనలో తాను అనుకుంటున్నట్టు.







"ఏది వింత?" అని అడిగిందామె చిన్నగా నవ్వుతూ.

"నిన్ను మొట్టమొదటిసారిగా ఇప్పుడే నేను చూస్తున్నాను. అయినా నీ నవ్వు నాకు చిరపరిచితంగా తోస్తున్నది. నువ్వెప్పుడయినా, మా బంగారులోయ రాజ్యానికి వచ్చావా?" అని అడిగాడు వినోదుడు.

ఆ యువతి కిలకిలా నవ్వుతూ, "లేదు; ఈ సుందరమైన లోయను వదలి వెళ్ళవలసిన అవసరం నాకెప్పుడూ కలగలేదు. నీకీలోయ అందంగా కనిపించడం లేదా?" అన్నదామె.

"అందంగా కనిపించడమా! ఇంతకన్నా సుందరమైన ఉద్యానవనాన్ని నేను ఊహించనైనా ఊహించలేను. అయినా, ఇప్పుడు నాకొక విషయం స్ఫురణకు వస్తున్నది. నేను తరచూ మా రాజధాని నగరాన్ని వదలి అరణ్యాలకు పోయి అక్కడి పొదలమధ్యా, శిథిలాలమధ్యా ఆడుకుంటూ కాలక్షేపం చేసేవాణ్ణి. ఆ సమయంలో మేఘాల మధ్య నుంచి దిగి వచ్చినట్టుగా ఆకాశం నుంచి అప్పుడప్పుడు ఒక వింతపక్షి వచ్చి, ఒక చెట్టు కొమ్మ మీద వాలి, 'సుదూరతీరంలో ఉన్న దొక యువరాణి....యువరాణి!' అని మధురంగా పలికేది. అప్పుడు నా కళ్ళముందు చిరునవ్వులుచిందే ఒక యువతి ముఖం లీలగా కదలాడేది. నిన్ను చూస్తూంటే ఆ యువతి ముఖమే జ్ఞాపకం వస్తున్నది," అన్నాడు వినోదుడు.

"అలాగా! నేనేమో ఈ భూమికి యువరాణినే. నేను నిద్రిస్తున్నప్పుడు తరచూ నాకొక గీతాలాపన వినిపించేది. ఆ గీతమూ, నువ్విప్పుడు పాడినపాటా ఒక్కలాగే ఉన్నవి. నేను కూడా అలా పాడడానికి ఎంతగానో ప్రయత్నించాను. అయినా సాధ్యపడలేదు. ఈ భూమికి అవతల ఒక దేవత ఉన్నదనీ, ఆ దేవత నుంచి వరం పొందితే తప్ప అలా పాడజాలమనీ పెద్దలు చెప్పారు. అయినా, ఇక్కడి వాళ్ళెవ్వరూ ఆ దేవత దర్శనానికి





వెళ్ళడం సాధ్యపడదు,'' అన్నది యువ రాణి ఎంతో విచారంగా.

''నేను కేవలం పాటే కదా పాడుతున్నాను,'' అన్నాడు వినోదుడు.

''అవును పాటే! నీలాగా జీవితంలో ఒక్కసారి పాడితేచాలు; నా జన్మ ధన్యమయినట్టే భావిస్తాను!'' అన్నది యువ రాణి.

''నీ కంఠస్వరం ఎంతో మధురంగా ఉన్నది. అయినా నువ్వెందుకు పాడలేవు?'' అని అడిగాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''నేనే కాదు. ఇక్కడ వున్న ఏ ఒక్కరూ పాడలేరు. అలా పాడే భాగ్యం మాకు లేదు. అయితే, నేను తప్ప ఈ భూమిలో ఎవరూ పాడాలని కోరుకుంటారనుకోను,'' అన్నది యువరాణి.

వినోదుడు ఆశ్చర్యపడుతూ ఒక బండ మీద కూర్చున్నాడు. యువరాణి ఎదురుగా కూర్చున్నది. ఆమె రూపం రూపుదాల్చిన దివ్యగీతం లాగున్నది. అయినా, పాపం ఆమె పాడలేదు!

అక్కడివాళ్ళు మామూలు మనుషులు కారని ముని చెప్పిన విషయం వినోదుడికి జ్ఞాపకం వచ్చింది. మనిషికి తప్ప మరే ప్రాణికీ మాట్లాడేశక్తి లేదు. అయినా మనుషులు చక్కగా మాట్లాడడానికి చేతగాక, తరచూ పాముల్లాగా బుసకొడతారు; కోతుల్లాగా కీచులాడుకుంటారు. ఇంకా కొందరయితే, మాట్లాడుతున్నామనుకుని కుక్కల్లాగా మొరుగుతారు—అని ముని ఒకసారి తనతో అన్న మాటలు అతని మనసులో కదలాడాయి.

మిగతా ప్రాణులకన్నా మానవులెంత అదృష్టవంతులో అతనికి అర్థమయింది. మానవులు హాయిగా నవ్వగలరు. అందంగా పాడగలరు. ఎన్నెన్నో అద్భుతాలు సాధించగలరు. అయినా తమలోని అజ్ఞానం కొద్దీ తమశక్తులను సక్రమంగా వినియోగించుకోలేకపోతున్నారన్న ముని మాట ఎంతో వాస్తవమనిపించింది వినోదుడికి.



"యువరాణీ, నువ్వు చెబుతున్న దేవత దర్శనం కోసమే నేను ఇక్కడకు వచ్చాను. అయినా ఆ దేవత ఎక్కడ వున్నదో, అక్కడికి వెళ్ళే మార్గం ఏమిటో నాకు తెలియదు. ఆ మార్గం నాకు తెలియజేశావంటే, నేను ఆ దేవత నుంచి నీకు పాడేవరం సంపాదించి తేగలను," అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

"నేను కూడా నీకొక రహస్యం చెబుతాను. ఈ నీలపర్వతం శిఖరాన ఒక చిత్రమైన మొక్క ఉన్నది. ఆ మొక్క యేడాదికి ఒక్కసారి ఒకే ఒక కాయ కాస్తుంది. ఆ పండును నక్షత్రఫలం అంటారు. ఆ పండును తిన్నవాళ్ళు ఈ భూమినిదాటి దేవత వున్న స్థలం చేరుకో కలుగుతారు," అన్నది యువరాణి.

"అలాంటప్పుడు, మీరెందుకు ఆ ఫలాన్ని ఇంతవరకు తినలేదు?" అని అడిగాడు వినోదుడు.

ఆ ప్రశ్నకు యువరాణి పకపకమంటూ నవ్వి, "మీ మానవులు తినే విధంగా మేము ఎలాంటి ఆహారమూ తీసుకోము," అన్నది.

"మీకు కావలసినశక్తి ఎలా లభిస్తుంది? మీరెలా ఎదుగుతారు?" అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

"పువ్వులు వికసించేలా మేమూ ఎదుగుతున్నాము. సూర్యుడి వెలుగు నుంచి సహజంగా మాకు కావలసినశక్తి లభిస్తున్నది. మాకు ఆకలిదప్పులు వుండవు. ఇంతెందుకు, ఇప్పుడు నీకు ఆకలి వేస్తున్నదా?" అని అడిగింది యువరాణి.

"ఆకలి వేయడం లేదు, నిజమే. కాని కావాలనుకుంటే ఆకలి వేయకున్నా ఆ ఫలాన్ని తినవచ్చుకదా?" అన్నాడు వినోదుడు.

"సాధ్యపడదు. ఎందుకంటే ఈ భూమిలో, చేయడానికి అవసరం లేని పనులు చేయాలనుకున్నా ఎవరూ చేయజాలరు!" అని వివరించింది యువరాణి.

ఆ సమయంలో అక్కడికొక జింక పరిగెత్తుకుంటూ వచ్చింది. —(ఇంకావుంది)








# 11

[వింత జలపాతం దాటి వెళ్ళిన వినోదుడు, ముని సహాయంతో అవరోధాలన్నిటినీ అధిగమించి, స్వప్నభూమిని చేరుకున్నాడు. వినోదుణ్ణి అగాధం దాటించి, ముని మాయమయ్యాడు. సంతృప్తశాంతభూమిని చేరుకున్న వినోదుడికి యువరాణి కనిపించి, నీలపర్వతం మీది నక్షత్రఫలం తింటే దేవతదర్శనం సాధ్యమవుతుందని తెలియజేసింది. —తరవాత]

వినోదుడూ, యువరాణీ కూర్చున్నచోటికి ఒక జింక పరిగెత్తుకుంటూ వచ్చింది.

"జింకా, నీలపర్వతం మీది వింత మొక్క, ఈ యేడాది కాయకాసిందేమో చూసి వస్తావా ?" అన్నది యువరాణి.

వెంటనే జింక సమీపంలో వున్న ఒక చిన్న కొండ మీదికి ఎక్కి, వెనక కాళ్ళపై నిలబడి చూసింది. కాని, మొక్క జాడ కనిపించలేదు. జింక దూరంగా వున్న ఒక కుందేలును పిలిచింది. కుందేలు జింక తల మీదికి ఎక్కి మొక్క కనిపిస్తుందేమో అని మెడసాచి చూసింది. అయినా కనిపించలేదు. ఇంతలో అటు కేసి ఒక ఉడత వచ్చింది. విషయం తెలుసుకుని, మొక్క జాడ తెలుసుకోవడానికి కుందేలు తల మీదికి ఎగబ్రాకి, ఉత్సాహంగా చుట్టుపక్కల కలయజూసింది. అయినా ప్రయోజనం లేకపోయింది. సమీపంలో

మనోజ్ దాస్







చెట్టు కొమ్మ మీద ఒక పిట్ట కనిపించింది. వెంటనే ఉడత ఆ పిట్టను చూసి, "పిట్టా, పిట్టా, వింతమొక్క కాయ కాసిందేమో చూడు," అన్నది. ఆ పిట్ట కొంత దూరం పైకెగిరి, దూరంగా ఆకాశంలో ఎగురుతూన్న డేగను చూసి, "డేగా, డేగా, వింత మొక్క కాయ కాసిందేమో చూడు," అన్నది.

డేగ అలాగే వెళ్ళి, నీలపర్వతం మీది వింత మొక్క సమీపంలో వాలి, మరుక్షణమే అక్కడి నుంచి మళ్ళీ పిట్ట దగ్గరకు వచ్చి, "వింత మొక్క కాసి ఉన్నది. ఒక్క రోజులో నక్షత్రఫలం పక్వానికి వస్తుంది!" అన్నది.

"అద్భుతం! ఈ రోజు నువ్వు ఇక్కడే గడిపి, రేపు నక్షత్రఫలాన్ని తిని, నీ ప్రయాణం కొనసాగించవచ్చు," అన్నది యువరాణి.

వినోదుడు సరేనన్నట్టు తలాడించాడు. వినోదుడు అక్కడ గడిపిన ఒక్క రోజులోనే ఎన్నో అద్భుతాలను కళ్ళారా చూశాడు. తృప్తి, శాంతి నిండిన భూమి అది అని గ్రహించాడు. ఆ సంతృప్తభూమి వాసులకు అద్భుతశక్తులున్నవి. చంద్రకాంతి నీలంగా వుండాలా? బంగారులా మిలమిలలాడాలా? వెండిలా తళతళలాడాలా? అన్న విషయం వాళ్ళు నిర్ణయించవచ్చు. అక్కడివాళ్ళు అందమైన చిత్రాలను ఊహించి, చిత్రించిన తరవాత వాటికి ప్రాణం పోయగల సమర్థులు! అలా వాళ్ళు ఎన్నెన్నో వినూతన భవనాలను, అందాల తటాకాలను, వింత వింత వృక్షాలనూ, రకరకాల పుష్పాలనూ సృష్టిస్తున్నారు. అయితే అవి శాశ్వతంగా వుండవు. స్వల్పకాలం మాత్రమే వుంటాయి. అయినా వాళ్ళు సుందర స్వప్నాలుకంటూ వాటికి కుంచెతో రూపం ఇస్తూ, తమ అపూర్వశక్తులతో ప్రాణం పోస్తూ గడపడంలో ఎంతో ఆనందాన్ని అనుభవిస్తున్నారు. అయితే ఒకే ఒక విషయం ఏమంటే—వాళ్ళు ఊహిం





చని విషయాలను మాత్రం సాధించలేరు. ఇందువల్ల వాళ్ళకు ఎటువంటి ఆపదా ముంచుకురాదు. అయినా అనుకోని మంచినీ, పురోభివృద్ధినీ సాధించలేరు. వాళ్ళకు ఒక విధంగా విశ్వాసం అంటే ఏమిటో కూడా తెలియదేమో అనిపించింది వినోదుడికి!

మర్నాడు వేకువజామున యువరాణి వినోదుణ్ణి నీలపర్వతశిఖరం కేసి నడిపించింది. అప్పుడు వినోదుడు ఆమెతో, "సంతృప్తజీవులూ, శాంతస్వభావులూ అయిన మీరు, సాధించలేనివి ఎన్నెన్నో మానవమాత్రులయిన మేము సాధించగలం. అసాధ్యాలను సుసాధ్యాలుగా మార్చడానికి మేము పూనుకోగలం. ఆపదలకు ఎదురీదగలం. అందాలను సృష్టించగలం. అయితే మాకున్న దురదృష్టమంతా—మాకున్న స్వేచ్ఛను దుష్కృత్యాలకు వినియోగిస్తున్నాము. అదే మాలో వున్న బలహీనత; మాపాలిటిశాపం!" అన్నాడు.

"అయితే, కావాలనుకుంటే మనుషులు మంచి వైపు మారవచ్చుకదా?" అని అడిగింది యువరాణి.

"అనుకుంటే మారవచ్చు; అయితే అనుకోవాలికదా! అలా అనుకునే నాధుడెవ్వడు? ముని అన్నట్టు—మానవులు చాలామంది అజ్ఞానాన్నే ఆనందంగా



భావించి, తమ జీవితాలను వెళ్ళబుచ్చుతున్నారు!" అన్నాడు వినోదుడు.

ఆ సమయంలో సూర్యోదయమవుతున్నది. ఆ ప్రాంతమంతా ప్రశాంత గంభీరంగా వున్నది. నీలపర్వత శిఖరం మీద ఉన్న వింతమొక్కకు ఒకే ఒక పండు వేలాడుతున్నది. ఆ పండు నక్షత్రం లాగా మెరుస్తున్నది. యువరాణి దానిని కోసి, వినోదుడి కిచ్చి, "నువ్వు చేరుకోవలసిన అవతలిప్రదేశ సరిహద్దు ప్రాంతం ఈ కొండ దిగువ ప్రారంభమవుతుంది. అక్కడ ఎప్పుడూ గాఢాంధకారం అలముకొని వుంటుంది, తుఫానులు చెలరేగుతూ వుంటాయి. ఉరుములూ, మెరుపులతో







ప్రకృతివిలయతాండవంచేస్తూవుంటుంది. నువ్వు ఈ నక్షత్రఫలాన్ని తిని వెళ్ళావంటే, ప్రకృతి నీకెలాంటి హానీ చేయదు. అయితే కొన్ని అమానుష శక్తులు అక్కడ వుంటాయి. నీలో ఏమాత్రం భయం పొడసూపినా నీకు అవరోధాలు కలిగించడానికి అవి కాచుకుని వుంటాయి. నీలో భయం చోటు చేసుకోనంతవరకు వాటిని గురించి పట్టించుకోనవసరం లేదు. ధైర్యంగా వెళ్ళి, విజయుడివై తిరిగిరా,'' అని చెప్పి వీడ్కోలు పలికింది.

వినోదుడు ఆ పండును తిని ముందుకు నడిచాడు. కొంతదూరం వెళ్ళాక, అతనికి కొండ మధ్య ఒక సన్నటి లోయ కనిపించింది. కొండచుట్టూ మేఘాలు కమ్ముకుని వున్నాయి. వినోదుడు మరి కొంతదూరం వెళ్ళి యువరాణి కోసం వెనుకకు తిరిగి చూశాడు. పొగమంచు దట్టంగా కమ్ముకుని వుండడంవల్ల ఆమె అక్కడ వున్నదీ, లేనిదీ కూడా తెలియలేదు. క్రమక్రమంగా పొగమంచు మరీ ఎక్కువై, బారెడు దూరానికి అవతల ఏముందో కూడా తెలియనంత దట్టంగా తయారయింది. మార్గం తిన్నగా వుండడంవల్ల ముందుకు నడవడం వినోదుడికి అంత కష్టంగా లేదు. ఆగి ఆగి మంచుగాలులు బలంగా వీచసాగాయి. వెనువెంటనే కళ్ళు బైర్లు కమ్మేలా మెరుపులు, చెవులు తూట్లు పడేలా ఫెళఫెళారావాలతో బండలను పిండి చేసే పిడుగులు పడసాగాయి. నేరేడుపళ్ళంత వర్షబిందువులు బండలమీద పడి కిందికి దొర్లుకుంటూ రాసాగాయి.

హఠాత్తుగా ఇరువైపులనున్న బండలలో రంధ్రాలుపడి అమితవేగంతో నీళ్ళు చిమ్మసాగాయి. క్షణాల మీద నీళ్ళు మోకాళ్ళవరకు వచ్చేశాయి. ఇక కొన్ని నిముషాలలో నీళ్ళలో మునిగిపోవడం తథ్యం అని వినోదుడు అనుకుంటూన్న తరుణంలో పెద్ద మెరుపు మెరిసింది. మెరుపు వెలుగులో నీళ్ళ మధ్య ఒక ఎత్తయిన బండవంటి ఆకారం కనిపించింది. ఒక్క





గెంతున వినోదుడు దాని మీదికి ఎగిరి కూర్చున్నాడు. మరుక్షణమే అది లేచి భీకరంగా గర్జిస్తూ పరిగెత్తసాగింది. తను బండ అనుకున్నది ఏదో పెద్ద మృగమని వినోదుడు గ్రహించాడు. అప్పుడప్పుడు మెరుస్తూన్న మెరుపుల వెలుగులో ఆ మృగం బంగారు చాయతో ఉండడం అతడు చూశాడు. పట్టువదిలితే కింద పడి పోగలనని, తన బలం కొద్దీ ఆ మృగాన్ని పట్టుకుని అలాగే వుండిపోయాడు.

కొంతసేపటికి ఆ మృగం వినోదుణ్ణి చిమ్మచీకటి నుంచి లేత వెలుగులోకి తీసుకువచ్చింది. ఆ వెలుగులో చూసి దాన్ని ఒక పెద్ద సింహం అని గ్రహించే లోపుగానే, అతనికి ఎదురుగా కొంత దూరంలో ఆకాశాన్నంటుతున్న భయంకర మైన జ్వాలలతో ఒక నిప్పులగోడ కనిపించింది. "అగు, అగు," అని వినోదుడు కేకలు వేస్తున్నా, సింహం ఆగకుండా అగ్ని కుడ్యం కేసి పరిగెత్తి క్షణంలో దానిగుండా బాణంలా దూసుకుపోయింది. వినోదుడు ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు. మరుక్షణమే సింహం నిప్పులగోడను దాటి అవతలికి వచ్చింది. వెంటనే గాలిలోకి విసిరివేయబడినట్టు అతనికి అనిపించింది. కొన్ని క్షణాలలో అతడొక తటాకంలో పడి వుండడం గ్రహించాడు.



నిప్పులగోడను దాటి తనను ఇవతలికి తెచ్చిన సింహం, ఒక తటాకంలోకి తనను విసిరి ఎటో పారిపోయిందని వినోదుడు గ్రహించాడు. పక్కనే ఉన్న నిప్పుల గోడ తటాకంలో ప్రతిబింబిస్తూ తటాక మంతా బంగారుద్రవం ఉన్నట్టు కనిపించింది.

తటాకం మధ్యగా నీళ్ళ పైభాగంలో ఒక వృక్షం కొమ్మలు సాచివుండడం వినోదుడి కంటపడింది. అతడు ఆ వృక్షం కేసి ఈదుకొని వెళ్ళి కొమ్మలపైకి ఎక్కి విపరీతమైన చలితో వణికిపోయాడు. కొమ్మలకు మధ్య చెట్టుబోదెలో అతని కొక తొర్ర కనిపించింది. ఆ తొర్రలో శాస్



వెచ్చగా వుంటుందికదా అనుకుని అతడు అందులోకి దిగాడు. అంతే, అతడు తొ్రగుండా అలాగే దిగబడిపోయాడు. అలా ఎంతదూరం వెళ్ళాడో అతనికి తెలియలేదు. కొంతసేపటికి కింద నిలబడి చుట్టుపక్కలు చూసి అమితాశ్చర్యం చెందాడు. అందమైన పుష్పాలు నిండిన సుందర ఉద్యానవనం మధ్య ఒక దేవాలయం కనిపించింది. తటాకం ఎక్కడ? వృక్షం ఎక్కడ? ఒక చెట్టు తొ్రలో ఇంత సువిశాల ప్రదేశం ఎలా ఇమిడి ఉన్నది?

''ఇందులో ఆశ్చర్యమేమున్నది?'' అన్న ఒక కంఠస్వరం విని, వినోదుడు అటుకేసి తిరిగి చూశాడు.

శాంతస్వభావుడయిన ఒక వృద్ధుడు మందహాసం చేస్తూ దగ్గరికి వచ్చాడు. ఆయన ఆ దేవాలయ పూజారి అయి వుంటాడని వినోదుడు అనుకున్నాడు.

''నా మనసులో ఉన్న అనుమానాలను మీరెలా గ్రహించగలిగారు? అయినా, చెట్టుతొ్ర చిన్న స్థలం కదా! అంత చిన్న స్థలంలో ఇంత పెద్ద ఉద్యానవనం గల సువిశాల ప్రదేశం ఎలా ఇమిడిందన్నదే నా అనుమానం!'' అన్నాడు వినోదుడు.

''స్థలానికి సంబంధించినంతవరకు చిన్నస్థలం, పెద్దస్థలం అంటూ ఏదీ లేదు. స్థలాన్ని మీరెలా కొలుస్తారు?'' అని అడిగాడు పూజారి.

''ఒక అడుగు, రెండు అడుగులు అని కొలబద్దతో కొలుస్తాము,'' అన్నాడు వినోదుడు.

''అలా మీరు కొలిచేది కొలబద్దనేకాని స్థలాన్ని కాదు. స్థలం అభిన్నం, అఖండం; దాన్ని విడిగా కొలవడం సాధ్యం కాదు. ఆలోచించిచూడు, అర్థమవుతుంది,'' అన్నాడు పూజారి.

పూజారి మాటలలో నిజం ఉన్నదనిపించింది వినోదుడికి.

''అయినా, నా మనసులోని ఆలోచనలను మీరెలా గ్రహించగలిగారు?'' అని అడిగాడు వినోదుడు.





''ఇక్కడ ప్రత్యేకించి నీ ఆలోచన, నా ఆలోచన అంటూ ఏదీలేదు. ఈ దివ్య ప్రదేశంలో ఎదుట వున్న మనిషిని చూసినట్టే, అతనిలోని ఆలోచనలను కూడా స్పష్టంగా చూడవచ్చు. ఇంతెందుకు? నా మనసులోని భావాలను కూడా నువు చూడవచ్చు. కావాలంటే ప్రయత్నించి చూడు,'' అన్నాడు పూజారి.

వినోదుడు, పూజారి మనసులో ఏమున్నదో తెలుసుకోవాలన్న ఉద్దేశంతో ఆయనకేసి చూశాడు. ఆ క్షణమే ఆ వృద్ధపూజారి మనసులో వున్న భావాలన్నీ వినోదుడికి తెలిసిపోయాయి.

''ఈ ఆలయంలోని దేవత దర్శనం కోసమే నేనింతదూరం ప్రయాణం చేసి వచ్చానని మీరు నాకు తెలియజెప్పనున్నారు. నేను మూడు వరాలు మాత్రమే కోరాలని చెప్పడానికి మీరు ఆశిస్తున్నారు. అంతేకదా!'' అన్నాడు వినోదుడు.

''అవును. అయినా, అది నీకు అంత సంతోషాన్ని కలిగించడం లేదు. ఎందుకంటే, నువ్వు నాలుగు వరాలు కోరాలన్న ఆశతో వున్నావు!'' అన్నాడు వృద్ధపూజారి.

''అవును. నిజమే,'' అన్నాడు వినోదుడు.

''అయితే, అది సాధ్యం కాదు. మూడు వరాలే పరిమితం. ఈసందర్భంలో నువ్వొక విషయం గుర్తించాలి. సృష్టిలో ప్రతి దానికీ ఒక పరిమితి అంటూ వుంటుంది. ఆ పరిమితి కొక కారణమూ, న్యాయమూ వుంటాయి. సింహం నిన్ను వీపు మీద మోస్తూ పరిగెత్తినప్పుడు నీ మదిలో కాస్త భయం మెదిలింది. అయినా సింహం అలా చేయకుండా వుంటే నువ్వు నిప్పుల గోడను దాటి వుండేవాడివా? అదే విధంగా చెట్టు తొర్రలో దిగబడిపోయినప్పుడు నీలో నిస్పృహ కలిగింది. అయితే, అలా దిగకుండా వుండి వుంటే నువ్విక్కడికి చేరేవాడివేనా? ఆలోచించు,'' అన్నాడు పూజారి.

నిజమే అన్నట్టు వినోదుడు తలాడించాడు.

—(ఇంకావుంది)








## 12

*[యువరాణి సహాయంతో. వినోదుడు నక్షత్రఫలం తిని, దేవతదర్శనం కోసం, ప్రకృతి విలయ తాండవం చేసే మార్గంగుండా పయనించి, తటాకమధ్యంలోని చెట్టు తొర్రలో దిగి, మరొక నూతన ప్రదేశాన్ని చేరుకున్నాడు. అక్కడ ఒక వృద్ధపూజారి కనిపించి, విశేషాలు వివరించి, దేవతను మూడు వరాలు మాత్రమే కోరాలని వినోదుణ్ణి ఆదేశించాడు. —తరవాత]*

క్రమక్రమంగా తూర్పుదిక్కు తెల్లవార సాగింది. కొంతసేపటికి బంగారు నీలి రంగుతో సూర్యకాంతి ఆ ప్రాంతానికి వింతశోభను సమకూర్చింది.

''ఇంతటి సుందరమైన ఉదయాన్ని నా జీవితంలో నేనెన్నడూ చూడలేదు. ఇప్పుడు నేనెక్కడున్నానో కూడా నాకు బోధపడడం లేదు,'' అన్నాడు వినోదుడు అమితాశ్చర్యంతో.

''భౌతిక ప్రపంచానికి దాపులనే ఉన్నావు. అయితే ఇది భౌతిక ప్రపంచంలో భాగం కాదు. ఇక్కడి సూర్యుడు మీ భౌతిక ప్రపంచంలో లాగా కేవలం వెలుతురూ, వేడీ మాత్రమే కాకుండా సర్వస్వాన్ని ప్రసాదిస్తాడు. చిత్తశుద్ధి కలిగివుంటేచాలు; సూర్యుడు నిన్ను జ్ఞానసంపన్నుడిగా చేయగలడు.'' అన్నాడు వృద్ధపూజారి.

మనోజ్ దాస్



"ఆశ్చర్యపడకు నాయనా! నీ ప్రార్థనలే పుష్పాలుగా మారి దేవత పాదాలపై బడ్డాయి. అసలు పువ్వులెలా పూస్తాయను కున్నావు? అందం కోసం, స్వచ్ఛతకోసం, శాంతికోసం ప్రకృతిపడే తపనే పువ్వులుగా వికసిస్తున్నాయి. వాటి నుంచి ప్రేరణ, ఉత్తేజం పొందగలరనే భూప్రపంచంలో పువ్వులు పూస్తున్నాయి. మంచి కోసం, మాధుర్యం కోసం ఎవరైనా ప్రార్థించినట్ట యితే, ఈ లోకంలో శూన్యంలోనుంచి పుష్పాలు పుట్టుకొస్తాయి!" అని వివరించాడు వృద్ధపూజారి.

వినోదుడు మౌనంగా భక్తితో చేతులు జోడించాడు.

"మీరు సామాన్య పూజారులు కారు; పరమ యోగీశ్వరులు!" అన్నాడు వినోదుడు.

వృద్ధపూజారి చిన్నగా నవ్వి, వినోదుణ్ణి ఆలయం లోపలికి తీసుకుపోయాడు.

దివ్యసుందరరూపంతో వెలుగొందే ఆ దేవతవిగ్రహాన్ని చూడడంతో వినోదుడి కళ్ళనుంచి ఆనందబాష్పాలు రాలాయి. అతడు విగ్రహానికి సాష్టాంగనమస్కారం చేసి, మనసారప్రార్థించి, మెల్లగా తల పైకెత్తి విగ్రహం కేసి చూశాడు. విగ్రహం పాదాలముందు గుప్పెడు పుష్పాలు ఉన్నాయి. అతడు నమస్కరించడానికి ముందు అవి అక్కడ లేవు!

"ఇక్కడ చాలా సేపు వుండడం సాధ్య పడదు. త్వరగా దేవతను కోరవలసిన మూడు వరాలూ కోరుకో," అన్నాడు పూజారి.

వినోదుడు దేవతావిగ్రహానికి భక్తితో నమస్కరిస్తూ, "బంగారులోయ రాజ్యంలో శిథిలాల మధ్య వున్న బంగారువిగ్రహానికి ప్రాణం ప్రసాదించు తల్లీ," అని ప్రార్థించాడు.

వెంటనే తామరపువ్వొకటి దేవతపీఠం మీద పడింది.

"నీ ప్రార్థన ఫలించింది. నీ వేలికి వున్న ఉంగరాన్ని తీసి, ఆ బంగారు విగ్రహం





పేలికి వెయ్యి. ప్రాణం వస్తుంది,'' అన్నాడు పూజారి.

ప్రాణాలు వచ్చిన ఆ స్త్రీని పెళ్ళాడాలన్న కోరికను రెండవ వరంగా కోరాలన్న ఆశ వినోదుడి మనసులో మెదిలింది. అయినా, ఆ ఆశను కాస్త పక్కకు నెట్టాడు. నవ్వలేని జ్ఞానభూమి యువరాజు అతనికి జ్ఞాపకం వచ్చాడు.

''మహామృగభూమి వాసులు హాయిగా నవ్వేవరం ప్రసాదించుతల్లీ,'' అన్నాడు వినోదుడు.

దేవతావిగ్రహం చేతినుంచి మరొక తామరపుష్పం పీఠం మీద పడింది.

''ఆ వరమూ సిద్ధించింది,'' అన్నాడు పూజారి.

వినోదుడు, ''సంతృప్తశాంతభూమి వాసులకు పాడగలశక్తి ప్రసాదించు తల్లీ,'' అన్నాడు భక్తితో.

మూడవ తామరపుష్పం దేవత చేతి నుంచి జారిందేగాని, పీఠాన్ని చేరలేదు. మధ్యలోనే తగులుకుని అలాగే వుండి పోయింది.

''సంతృప్తశాంతభూమి వాసులు పాడడం నేర్చుకోనవసరం లేదు. పైగా, నీకు తారసపడిన యువరాణి తప్ప మరెవ్వరూ పాడాలని కోరడం కూడా లేదు. అందువల్ల ఆమె మాత్రం పాడడం నేర్చుకుంటుంది,'' అని, పుష్పం మధ్యలోనే ఆగిపోయిన విషయం గురించి వినోదుడికి వివరించాడు పూజారి.





వినోదుడు మౌనంగా తలాడించాడు. ఇంకొకవరం కోరే అవకాశం లేకుండా పోయిందే అన్న బాధ అతన్ని వేధించసాగింది. అయినా, ఇంకొక వరం కోరితే మాత్రం తప్పేమిటి? అన్న ఆలోచన అతనిలో కలిగింది. మరుక్షణమే ఒక వింతధ్వని వినిపించింది. తిరిగి చూశాడు. ఏదీ స్పష్టంగా కనిపించడం లేదు. చుట్టుపక్కలన్నీ గిర్రున తిరుగుతున్నట్టనిపించింది. కొండలూ, కోనలూ, నదులూ, తటాకాలూ, ఉద్యానవనాలూ, భవనాలూ అన్నీ అగాధంలో కూలిపోతున్నట్టనిపించింది. అయినా ఒక్క దృశ్యం కూడా స్పష్టంగా కనిపించడం లేదు. వినోదుడు స్పృహకోల్పోయి అక్కడే పడిపోయాడు.

కొంతసేపటికి స్పృహ వచ్చి కళ్ళు తెరిచి చూస్తే, వినోదుడు నీలపర్వతం మీది వింతమొక్క దగ్గర ఉన్నాడు. ఎదురుగా యువరాణి నవ్వుతూ కూర్చుని వున్నది!

"నువ్వు పాడే వరం తెచ్చాను యువరాణీ!" అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

"ఆ విషయం నాకూ తెలుసు. నీ యాత్రలో విజయం సాధించబట్టే నువ్వు మళ్ళీ ఇక్కడికి సురక్షితంగా చేరుకోగలిగావు!" అన్నది యువరాణి.

"సరే, మనం ఇప్పుడొక పాట పాడుదామా?" అని అడిగాడు వినోదుడు.

"నేర్పితే పాడుతాను," అన్నది యువరాణి ఉత్సాహంగా.

వినోదుడు మెల్లగా పాడడం ప్రారంభించాడు. యువరాణి అతన్ని అనుసరించి పాడసాగింది. మొదట కాస్త తడబడినప్పటికీ కొంతసేపటికి ఆమె చక్కగా పాడసాగింది. అయితే, అలా పాడుతున్నకొద్దీ, ఆమె తన నుంచి దూరంగా వెళుతూ వుండడం గమనించి వినోదుడు కంగారుపడ్డాడు. కొంతసేపటికి ఆమె పాడుతూ పాడుతూ మేఘంలా ఆవిరిగా మారి, అతని కళ్ళెదుటే మాయమైపోయింది!





"యువరాణీ! యువరాణీ!" అని అరుస్తూ, పిచ్చివాడిలా అటూ ఇటూ పరిగెత్తాడు వినోదుడు. తిరిగి తిరిగి ఆఖరికి ఒకచోట సొమ్మసిల్లి పడిపోయాడు!

"యువరాణి భౌతికప్రపంచానికి చెందిన వ్యక్తి కాదన్న విషయం నువ్వు మరిచిపోకూడదు. ఆమె నివసిస్తూన్న ప్రపంచానికి చెందినవాళ్ళు, ఉన్న వాటికే సంతసించి తృప్తిగా జీవిస్తారు. పాటపాడడానికి కోరడం అంటే, ఉన్న దానికన్నా ఎక్కువ ఆశించడం అన్న మాటే కదా! అలా ఆశించడం మానవ స్వభావం. ఆ సంతృప్తభూమిలో నివసించే వాళ్ళలో ఒక్క యువరాణికి మాత్రమే పాడాలనే కోరిక వుండేది. బహుశా మానవ రూపం దాల్చడానికే ఆమె ఆ విచిత్ర ప్రపంచం నుంచి మాయమైపోయి వుంటుంది!"

వినోదుడు కళ్ళు తెరిచేప్పటికి ఈ మాటలు అతనికి వినిపించాయి. మొదట తనకు దారిచూపిన కరుణాస్వరూపుడయిన ముని తన పక్కన కూర్చుని వుండడం చూసి వినోదుడు, ఆయనకు భక్తితో నమస్కరించాడు.

"ఇప్పుడు నేనెక్కడున్నాను?" అని అడిగాడు వినోదుడు.

"జ్ఞానభూమి సరిహద్దులలో ఉన్నావు. ఇక్కడే కాలయాపన చేయకూడదు. నువ్వు సంపాదించిన వరం జ్ఞానభూమి ప్రజలకు సర్వేశక్తిని ప్రసాదించిందన్న





బడింది. రాజప్రాసాదం కొండకు సమీపం లోనే ఉన్నది. కొందరు రాజభటులు వినోదుణ్ణి చూసి, పోల్చుకుని పరిగెత్తి పోయి అతని రాకను రాజుకు తెలియ జేశారు.

కొంతసేపటికి రాజూ, యువరాజూ, మంత్రి, ముఖ్య రాజోద్యోగులూ రాజ భవనం ఉపరితలం మీదికి వచ్చి, ఉత్సా హంగా చేతులు ఊపుతూ, వినోదుడికి స్వాగతం పలికారు. ఇంతలో మరికొందరు రాజభవనానికి వెలుపలచేరి ఉత్సాహంగా చేతులు ఊపసాగారు.

అందరూ పరమానందంతో నవ్వు తున్నారు!

తృప్తితో నువ్వు బంగారులోయకు బయలు దేరాలి,'' అన్నాడు ముని.

''ఎలా వెళ్ళడం? నేనామార్గం మరిచి పోయానే!'' అన్నాడు వినోదుడు.

ముని చిన్నగా నవ్వి, ''ఒకచోట అదృశ్యమై, మరొకచోట ప్రత్యక్షమయ్యే రహస్యం నీకు తెలుసునన్న విషయం కూడా నువ్వు మరచిపోయావు! ఆ విద్య ఇప్పుడు నీకు ఉపయోగపడుతుంది. దాని సాయంతో నీ స్వస్థలం చేరుకోవచ్చు,'' అన్నాడు.

తరవాత ముని దారి చూపగా, వినోదుడు ఒక చిన్న కొండను ఎక్కాడు. కొండ కవతల జ్ఞానభూమిరాజ్యం అతని కంట

వాళ్ళను చూడగానే వినోదుడు కూడా చాలా సంతోషించాడు. కొంతసేపు వాళ్లతో గడిపితే బావుంటుందనిపించిందతనికి. అయితే, దూరాన్నుంచి ముని, ''కాలా తీతమవుతున్నది. త్వరగా బంగారులోయ చేరుకో," అని ఆదేశించడంవల్ల, వినోదుడు మునికి నమస్కరించి, ఆయన వద్ద సెలవు తీసుకుని, బంగారులోయ చేరుకో వాలని కోరుకుంటూ అక్కడే శక్తితరంగా లుగా మారి, క్షణాలలో మాయమై పోయాడు!

కొంతసేపటికి అతడు బంగారులోయ కొండలలో ప్రత్యక్షమయ్యాడు. నిండు





పున్నమి వెన్నెలలో వింత జలపాతం మరింత శోభతో ప్రవహిస్తున్నది. అతని తల మీదుగా కోయిల కూస్తూ ఎగిరింది. ఆ కోయిలకూతకు అతని శరీరం జలదరించింది. వినోదుడు శిథిలాలమధ్య వున్న బంగారువిగ్రహాన్ని సమీపించాడు.

తన వేలి ఉంగరం తీసి విగ్రహం వేలికి వేయగానే, ఆ విగ్రహానికి ప్రాణం వస్తుంది. ఆ తరవాత జరిగే దేమిటి? తను ఆమెను పెళ్ళాడాలని దేవత నుంచి వరం కోరలేదు. కనుక ఆమెను పెళ్ళాడడం సాధ్యం కాదు. మరి, దురాశాపరుడైన రాజు బారినుంచి ఆమె ఎలా తప్పించుకోగలదు? ఇలా కొంత సేపు ఆలోచించి—ముందుగా, విగ్రహాన్ని ప్రాణంతో చూద్దాం. ఆ తరవాత జరిగేది జరగనీ—అనుకుని వినోదుడు తన వేలి ఉంగరం తీసి ఆ విగ్రహం చేతివేలికి పెట్టాడు.

ఆ క్షణమే మెరుపు మెరిసినట్టయింది. అపురూప సౌందర్యంతో వెలిగిపోతూ, ఒక స్త్రీ, పీఠం మీది నుంచి ఒయ్యారంగా కిందికి దిగి అప్సరసలా నవ్వుతూ, వినోదుడి పక్కకు వచ్చి నిలబడి, ''ఇప్పుడు మన వివాహం పూర్తయిందన్న మాట!'' అన్నది.

ఆమె కంఠస్వరమూ, నవ్వూ వినోదుడికి చిరపరిచితంగా ఉన్నట్టే అనిపించింది. అయినా ఆ కంఠస్వరం ఎక్కడ విన్నాడో, నవ్వును ఎక్కడ చూశాడో వెంటనే పోల్చుకోలేక పోయాడు.

"మనకు వివాహమయిందా!'' అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''నువ్వు వింతజలపాతం దాటి వెళ్ళే ముందు, నా వేలి ఉంగరం, నీ వేలికి చేరింది; ఇప్పుడు నువ్వు తిరిగి వచ్చాక, నీ చేతి ఉంగరం తీసి నాకు వేశావు. మరి మన పెళ్ళితంతు పూర్తయినట్టే కదా?'' అన్నదామె నవ్వుతూ.

తను దేవతను కోరనివరం ఇలా సిద్ధించినందుకు వినోదుడు ఎంతగానో పొంగిపోయాడు. —(ముగింపు వచ్చేసంచికలో)






## 13

[దేవత నుంచి వరాలు పొంది, ముని ఆదేశం ప్రకారం వినోదుడు, జ్ఞానభూమిగుండా బంగారులోయ రాజ్యం చేరుకున్నాడు. అతడు తన వేలి ఉంగరం తీసి బంగారు విగ్రహానికి పెట్టగానే—విగ్రహానికి ప్రాణం వచ్చి, పీఠంమీది నుంచి నవ్వుతూ దిగివచ్చి పక్కన నిలబడి, ఇరువురికీ వివాహం పూర్తయిందని చెప్పింది. వినోదుడు పరమానందం చెందాడు. —తరవాత]

వినోదుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ఆ తరవాత, ''మానవప్రపంచానికి అవతల నేనొక యువరాణిని చూశాను. నువ్వు ముమ్మూర్తులా ఆమెలాగానే ఉన్నావు!'' అన్నాడు.

''నువ్వు పాటపాడడం నేర్పిన యువరాణి; నీ కళ్ళముందరే అదృశ్యమైపోయిన యువరాణి గురించేనా నువ్వు చెబుతున్నది,'' అన్నదామె.

''అవును, అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు వినోదుడు.

"నిర్జీవమైన విగ్రహానికి ప్రాణం వచ్చిందంటే, ఆ ప్రాణం మరెక్కడినుంచో ఆ విగ్రహంలోకి వచ్చి ఉండాలి కదా? నువ్వు చూసిన ఆ యువరాణి ప్రాణమే నాలో ఉన్నది!'' అన్నదామె.

''అలాగా!'' అన్నాడు వినోదుడు పట్టరాని ఆనందంతో.

మనోజ్ దాస్







విగ్రహాన్ని సృష్టించిన విషయం వినోదుడికి తెలియవచ్చింది!

"మనం ఇంకా ఇక్కడ వుండడం క్షేమం కాదు. రాజులాగా నటిస్తున్న దుష్ట మాంత్రికుడు చేస్తున్న దుండగాలు నీకు తెలియవు. రాజు దురాశాపరుడయినప్పటికీ, నన్ను పెళ్ళాడాలన్న పేరాశ కొద్దీ నాకు ప్రాణం తెప్పించడానికి పడరాని పాట్లు పడుతున్నాడు. అయితే, దుర్మార్గుడైన ఈ మాంత్రికుడు బంగారం కోసం విగ్రహాన్ని పెకలించి, కరిగించడానికి పథకం వేశాడు. అతని భటులు కొంతసేపట్లో ఇక్కడికి రాగలరు," అన్నది యువరాణి.

వినోదుడూ, యువరాణీ కొంతసేపటికి ఎత్తైన కొండశిఖరాన్ని చేరుకున్నారు. అప్పుడప్పుడే చీకటిని దూరం చేస్తూ సూర్యుడుదయిస్తున్నాడు.

"ఎంత అందంగా ఉన్నదీ భూప్రపంచం!" అన్నది యువరాణి.

"నిజంగానా!" అంటూ వినోదుడు ఇంకా ఏదో చెప్పబోయేంతలో కొండ దిగువన ఏదో కలకలం వినిపించింది. ఇద్దరూ అటుకేసి చూశారు.

రాజభటులు, "విగ్రహం ఎక్కడ? పీఠం మీది బంగారు విగ్రహం ఏమయింది?" అని ఒకరినొకరు అడుగుతూ,

"ఈ తామరపుష్పాన్ని ఒక్కసారి వాసన చూశావంటే అసలు నువ్వెవరివో నీకు తెలిసివస్తుంది." అంటూ ఆమె తన చేతిలోని తామరపుష్పాన్ని వినోదుడికి అందించింది.

అతడు ఆ పువ్వువాసన చూశాడు.

మరుక్షణమే—కొండమీది అందమైన రాజప్రాసాదంలో యువరాజు బంగారు విగ్రహాన్ని చెక్కడంలో నిమగ్నమైవున్న దృశ్యం అతని మనోనేత్రాల ముందు మెరుపులా మెరిసింది. తనూ, ఆ యువరాజూ ఒక్కరే అన్న విషయం కూడా అతడు గ్రహించాడు. గతమంతా స్పష్టంగా గుర్తురావడంతో, తనే ఆ బంగారు





ఆకలిగొన్న తోడేళ్ళలా అటూ ఇటూ తిరగసాగారు.

కొంతసేపటికి రాజు వేషంలో వున్న మాంత్రికుడు పెద్ద పెద్ద అంగలు వేసు కుంటూ అక్కడికి వచ్చాడు. చెప్పరాని వేదనతో, పట్టరాని కోపంతో, ''భటు లందరినీ హతమారుస్తాను,'' అన్నాడు కీచుకంతంతో.

భటులకేసి చూస్తూ మరికొంతసేపు కాలుకాలిన పిల్లిలా చిందులు తొక్కాడు. ఆ తరవాత అతడి దృష్టి అసలురాజు వున్న గుహ కేసి మళ్ళింది. తాను మోసంతో రాజును బంధించిన విషయం ఇంతవరకూ ఎవరికీ తెలియదన్న సంగతి కూడా మరిచిపోయి, ''వాడే, రాజే ఆ విగ్రహాన్ని దొంగిలించి వుంటాడు!'' అని అరిచాడు.

వాడి మాటలు విని, అక్కడికి వచ్చిన మంత్రీ, మహాజ్ఞానులూ దిగ్భ్రాంతి చెందారు. వాడు భటులను వెంటబెట్టుకుని గుహలోపలికి వెళ్ళి, అందులో వున్న గోడను పగలగొట్టమని ఆజ్ఞాపించాడు.

భటులు నిమిషాలలో గోడను పగల గొట్టి అవతలవున్న రాజును బయటకు తీసుకువచ్చారు.

రాజు చిక్కిశల్యమై, చింపిరి గడ్డంతో దయ్యంలాగా ఉన్నాడు. ఆయన ఒక్క గెంతున ముందుకు దూకి, ఎవరూ ఊహించని విధంగా, రాజు వేషంలో వున్న మాంత్రికుడి నడుముకు వేలాడు





తున్న ఒరలోని కత్తిని లాక్కుని, వికటాట్ట హాసం చేస్తూ మాంత్రికుడి తలను తెగ వేశాడు!

రాజు వేషంలో వున్న మాంత్రికుడి అంగరక్షకులు రాజుకేసి రాసాగారు. అయితే, అసలురాజు కంఠస్వరం గుర్తు పట్టి అలాగే నిలబడిపోయారు.

రాజు మంత్రినీ, మహాజ్ఞానులనూ పేరు పేరునా పిలిచి, ''వెళ్ళండి, మీమీ ఇళ్ళకు వెళ్ళి, వెంటనే నాకు రుచికరమైన ఆహారం తీసుకురండి,'' అని ఆజ్ఞాపించాడు.

కంఠస్వరాన్నీ, మనస్తత్వాన్నీ బట్టి ఆకలిగొన్న గుడ్లగూబలా ఉన్నప్పటికీ, ఆయనే తమ రాజని, రాజోద్యోగులు గుర్తించారు!

తమ ఎదుట రక్తంలో పడివున్న మాంత్రికుడి శవాన్ని ప్రతి ఒక్కరూ కాలితో తన్నసాగారు. అలా తన్నేందుకు వీలుగా, వాళ్ళను వరుసక్రమంలో పంపడానికి ముఖ్యమంత్రి నానాయాతనలు పడసాగాడు.

''నిష్ప్రయోజనమైన ఆ దుర్మార్గుడి శవాన్ని తన్నడంకన్నా, బంగారాన్ని తన్నండిరా మూర్ఖుల్లారా!'' అని అరిచాడు రాజు.

అందరూ రాజుకేసి ఆశ్చర్యంగా చూశారు.

''బంగారువిగ్రహం పీఠానికి అడుగున వున్న బండకింద, బంగారుద్రవం నిండిన పెద్ద తటాకం వున్నది. గుహలో బందీగా వున్నప్పుడు సారంగంకుండా నేనా తటాకాన్ని చూశాను. రండి. దానిని త్రవ్వండి. అయితే ఒక్కటిమాత్రం బాగా గుర్తుంచుకోండి. ఆ తటాకంలోని బంగారమంతా నాదే. కావాలంటే కొన్నాళ్ళు గడిచాక మీకంతా ఒక్కొక్క గరిటెడు ఇవ్వగలను. నోళ్ళు వెళ్ళబెట్టి నా లోయలోని గాలినంతా పీల్చేస్తూ అలా చూస్తూ నిలబడ్డారెందుకు? మూర్ఖుల్లారా కదలండి. ఈ క్షణమే మీరు తవ్వడం ప్రారంభించండి.







నాకు లడ్డూలు తెచ్చిపెట్టండి!" అని అరిచాడు రాజు.

ఇంతకుముందు విగ్రహాన్ని పెకలించడానికి వచ్చిన రాజభటులు, అమితోత్సాహంతో ఇప్పుడు పలుగులతో పీఠం కింది బండను పగలగొట్టడం ప్రారంభించారు.

హఠాత్తుగా పిడుగుపడ్డట్టు భయంకరమైన శబ్దం వినిపించింది. వాళ్ళు పగలగొట్టడానికి పూనుకున్న బండ చుక్కలా ఆకాశంలోకి దూసుకుపోయి మేఘాల మధ్య వేనవేల ముక్కలయింది. ఆ బండ వున్నచోటు నుంచి, చెప్పరాని వేగంతో బంగారుద్రవం బుగ్గ పైకి చిమ్ముకొచ్చింది. దానిని చూడగానే అక్కడి వారు భయాశ్చర్యాలతో కేకలు వేయసాగారు. కొంతసేపటికల్లా బంగారుద్రవం ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టసాగింది. సలసల కాగుతూండడంవల్ల, ఆ ద్రవం తాకగానే దాని వేడికి తట్టుకోలేక భటులు విలవిల తన్నుకుంటూ అక్కడే పడి ప్రాణాలు కోల్పోసాగారు.

రాజూ, మంత్రీ, మహాజ్ఞానులూ హడలిపోయి అక్కడి నుంచి తప్పించుకోవడానికి ఎంతో ప్రయత్నించారు. కాని, క్షణక్షణానికి బంగారుబుగ్గ వేగం హెచ్చి, ప్రవాహం ఉధృతం కాసాగింది. ఒకటి రెండు నిముషాలలో వాళ్ళందరూ సలసల కాగుతున్న ఆ ద్రవంలో మునిగిపోయారు.

భయంకరమైన ఆ ద్రవప్రవాహం మైదానాలకేసి రావడం చూసి, కొండ దిగువన ఉన్న ప్రజలు భయభ్రాంతులయ్యారు. ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకుని హృదయ విదారకంగా కేకలు వేస్తూ దిక్కుదిక్కుకూ పరిగెత్తసాగారు. అయినా ఆ బంగారుద్రవప్రవాహం తాకిడి నుంచి ఒక్కరు కూడా తప్పించుకోలేకపోయారు.

మిట్టమధ్యాన్నంవరకు అలా ప్రళయభీకరంగా పెల్లుబికిన బంగారుద్రవప్రవాహం నెమ్మదిగా ఆగిపోయింది. ఎక్కడ చూసినా భయానకమైన నిశ్శబ్దం





అలముకున్నది. పక్షులు సైతం అరవ డానికి సాహసించలేకపోయాయి!

''బంగారులోయ రాజ్యం ఇప్పుడు నిర్మానుష్యప్రదేశం!'' అన్నది యువరాణి విచారంగా.

''భూప్రపంచం ఎంతో అందమైన ప్రదేశం అని నువు ఇంతకుముందే అన్నావు. అయినా, మానవుడు ఎంతటి దురదృష్టవంతుడు! తన చేజేతులా మానవుడే భూమిని నివాసయోగ్యం కాకుండా చేసుకుంటున్నాడు,'' అన్నాడు వినోదుడు పెద్దగా నిట్టూరుస్తూ.

కొంతసేపు మౌనంగా ఊరుకుని, యువరాణి, ''మన ప్రస్తుత కర్తవ్యం ఏమిటి? మనం ఎక్కడికి వెళ్ళడం? ఏం చెయ్యడం?'' అని అడిగింది.

"ఇక్కడే వుండి ప్రార్థనలు జరుపుదాం. మన ప్రార్థనలు ఫలించి మళ్ళీ ప్రజలు తప్పక తిరిగివస్తారు. వాళ్ళు నూతన జీవితం ప్రారంభించడానికి మనం సహాయపడదాం,'' అన్నాడు వినోదుడు.

''అదిగో చూడు! బంగారు ద్రవం బండరాయిగా మారిపోతున్నది!'' అన్నది యువరాణి.

''మారిపోనీ. అది మళ్ళీ బంగారమవుతుంది. మనుషుల మనసులు బంగారంలా మారినప్పుడు ఆ బండరాయి మళ్ళీ బంగారమవుతుంది. అదిగోచూడు ఆ చిన్న కొలను. అందులో బురదతప్ప మరేదీలేదు. అయినా సూర్యకాంతి సహాయంతో అందులో నుంచి అందమైన తామరపుష్పాలు వికసిస్తున్నాయి. ప్రకృతిలోనే అటువంటి అద్భుతం సాధ్యమైనప్పుడు, దేవుడి దయవల్ల మనిషిలో కూడా ఏమాత్రం చెడు చేయనటువంటి మహత్తరమైన మార్పురాదా?'' అన్నాడు వినోదుడు.

''తప్పకుండా వస్తుంది!'' అన్నది యువరాణి.

ఇరువురూ ఒకరినొకరు చూసి చిన్నగా నవ్వారు. ఆ నవ్వులో విశ్వాసరేఖలు ప్రకాశించాయి! —(అయిపోయింది)

